Navaśakti

Vol. 2, no. 30

(Jul. 12, 1939)

Bejavāḍa, 1939

Regd. No. M. 3824

# నవశక్తి

ఆంధ్రరాష్ట్ర కాంగ్రెసు సోషలిస్టు పార్టీ వారపత్రిక

సంపుటం 2 | బుధవారం 12-7-39 | బెజవాడ | సంచిక 30

## తీర్మానాలను విమర్శించడం తప్పట!

### రాజెన్‌బాబు ప్రకటన - నెహ్రూ వింత వైఖరి - తీవ్రవాదుల సమాధానం

తీర్మానాలు తప్పేకాని నోరుమూసుకూర్చోవాలంటాడు నెహ్రూ

#### రాజన్‌బాబు ప్రకటన

"ఇప్పుడు అఖిలభారత కాంగ్రెసు సంఘమునకు లోబడియున్న సంఘములుగాని కార్యనిర్వాహకులుగాని అట్టి తీర్మానములను ప్రతిఘటించి అసమ్మతి సభలను ఏర్పాటుచేసినచో కాంగ్రెసులో క్రమశిక్షణ అనేదే వుండదు. సంస్థ సంపూర్ణముగా ధ్వంసమై పోతుంది.

కనుక అన్ని కాంగ్రెసు సంఘములకును కార్యనిర్వాహకులకును నా విజ్ఞాపన ఏమనగా అట్టి తీర్మానములపై అసమ్మతి సభలు సమావేశపరచడమూ, ప్రతిఘటనకావించుట మొదలగు యత్నములు క్రమశిక్షణను భంగపరచినట్లే అవుతుంది. కనుక కాంగ్రెసు సంఘములును కార్యనిర్వాహకులును యిట్టి అసమ్మతి ప్రదర్శనములలో పాల్గొనకూడదు."

#### బోసు సమాధానం

"కాన్‌స్టిట్యూషన్ ప్రకారం ఆలోచించినా, ప్రజాస్వామిక ధర్మాలనుపట్టి చూచినా ఎ. ఐ. సి. సి. తీర్మానాలను నిరసించడానికిమాకుహక్కు ఉంది. ఈహక్కులకు మీరు అభ్యంతరం కలిగించడం నాకు ఆశ్చర్యకరంగా ఉంది. ఈతీర్మానాలను వెంటనే ఆచరణలోపెట్టక కొంతకాలం ఆపవలెనని మా ప్రకటనలో కోరాము. మా కోరికను గురించి సానుభూతితో ఆలోచించాలని మిమ్ములను కోరుచున్నాము.

జూలై తొమ్మిదవతేదీని దేశమంతట జరుగవలసిన సభలను ఆపజాలమని వ్రాయుటకు విచారిస్తున్నాను."

#### అతివాద సమ్మేళన సంఘం వారి ప్రకటన

"తన అభిప్రాయాలను వెల్లడిచేసి కాంగ్రెసులో అధికసంఖ్యాకులను తనవైపు త్రిప్పుకోడానికి ప్రతి కాంగ్రెసు సభ్యునకు హక్కు ఉంది. ప్రజాస్వామ్య ధర్మాన్నిబట్టి, నియమావళిని బట్టికూడా కాంగ్రెసువారికి హక్కు ఉంది. కాని రాజేంద్రబాబు తన ప్రకటనలో ఈహక్కునకు అభ్యంతరం తెలిపారు.

ఇలాంటి తీర్మానాలలో మార్పులు చేయుంచడానికి ప్రయత్నించుటకు సభ్యులకు హక్కుకలదని రాజేంద్రబాబు ఒప్పుకున్నట్లయితే పత్రికలద్వారాను. బహిరంగసభల ద్వారాను ప్రచారంచేసి ప్రయత్నించడంతప్ప రాజేంద్రుడు దయచేసి మరొక మార్గాన్ని చూపించెదరా? రాజేంద్రుడుచేసిన సలహాను పాటించినట్లయితే విమర్శలకు తావు లేనేలేదు. ఒకమారు ఆమోదింపబడిన తీర్మానాలను మరి సంస్కరించడానికి ప్రయత్నించుటకు అవకాశం ఉండనే ఉండదని చెప్పవచ్చును.

క్రమశిక్షణ అనే నెపంతో కాంగ్రెసు మహాసంస్థలోని ప్రజాస్వామిక శక్తులను అణచివేయవద్దని రాజేంద్రబాబుకి మామనవి.

ఏ. ఐ. సి. సి. వారు చేసిన రెండు తీర్మానాలను కొంతకాలం ఆపవలెనని, స్వాతంత్ర్య సమరానికి తగిన సన్నాహాలు చేయవలసిందని వర్కింగుకమిటీనికోరుచు జూన్ 30వ తేదీని మేమొకప్రకటన చేశాము. మా కోర్కెలను నెరవేర్చడానికి బదులు మాపైని కత్తులు నూరడం ప్రారంభించారు. ఇది చాల విచారకరము.

కాంగ్రెసువారు ప్రజోద్యమాల్లో పాల్గొని, ప్రజానురాగాన్ని చూరగొన్నారు. కాబట్టే ఆ మహాసంస్థ ఇంత అభివృద్ధిపొందింది. ఇప్పుడు వర్కింగు కమిటీవారు, ఏ. ఐ. సి. సి. లోని అధిక సంఖ్యాక సభ్యులు దీనికి ఆటంకం కలిగిస్తున్నారు. ప్రజోద్యమాల్లో కాంగ్రెసువారు ఇంకా ఎక్కువగా పాల్గొనునట్లు చేయడానికి బదులు కాంగ్రెసు పెద్దలు ఇలా ఆటంకాలు కలిగించడం ఎంత ఆశ్చర్యకరము!

1919 వ సంవత్సరంనుంచి నేటివరకు జరిగిన సత్యాగ్రహ ఉద్యమాలను ఒక్కసారి సింహావలోకనం చేయాలని రాజేంద్రునకు మా మనవి. వీనిలో ముందుగా రాష్ట్రీ కాంగ్రెసువారి అనుమతిని పొంది చేసిన సత్యాగ్రహాలెన్నున్నాయో వారు మాతో చెప్పగలరా?

మంత్రివర్గాల కార్యక్రమాన్ని తనిఖీచేయగల హక్కు రాష్ట్రీ కాంగ్రెస్‌కమిటీకి ఉంది. కాని, ఇప్పుడు ఈ తీర్మానం ఈ హక్కును రద్దుచేస్తున్నది. అంతేకాదు. కాంగ్రెసు సభ్యుల నోటికి తాళాలు వేస్తుంది. ఏ విషయాలను గురించిఅయినా రాష్ట్రీ కాంగ్రెసు కమిటీకి, రాష్ట్రీ మంత్రివర్గానికి అభిప్రాయ భేదాలువచ్చిన యెడల కాంగ్రెసు సభ్యులు ఆ విషయాలను గురించి బహిరంగంగా చర్చించకూడదని ఈ తీర్మానం తెలుపుతున్నది.

ఇలాంటి చర్చలు జరగడం మన మంత్రులకు ఎందుకు ఇష్టంలేదో తెలియడం లేదు.

కాంగ్రెసు మహాసంస్థ ఒక ప్రజాస్వామిక సంస్థ. ప్రజాస్వామిక సంస్థలలో ఇలాంటి చర్చలకు ఎల్లప్పుడు అవకాశం కలిగించాలి.

రాబోయే స్వాతంత్ర్య మహా సమరానికి సిద్ధము కావాలి అని త్రిపురీ కాంగ్రెసు ప్రజలనుకోరింది. త్వరలో ఈ మహాసమరానికి తొందరగా సిద్ధపడి, దేశాన్ని ముందుకు నడపకపోతే పరిస్థితులు చెడిపోవును. అని ఏ. ఐ. సి. సి. సభకు ముందు వర్కింగు కమిటీవారు ప్రకటించారు. ఇంత జరిగిన తరువాత కాంగ్రెసులోని మెజారిటీ పక్షంవారు వామ పక్షంవారిని ప్రతిఘటించడం మానుకొని, బ్రిటిషు సామ్రాజ్యాన్ని ఎదుర్కొని పోరాడుటకు దేశాన్ని సిద్ధపరుస్తారని అనుకున్నాము.

కాని ఏ. ఐ. సి. సి. సభ చాల ఆశాభంగం కలిగించింది. అయినను ఈ ఏ. ఐ. సి. సి. నిర్ణయాలే కడపటి నిర్ణయాలని అనుకోనము. ఈ నిర్ణయాలలో మార్పులు కలుగవచ్చును. ఈ తీర్మానాలను కొంతకాలం నిలిపి ఉంచాలని వర్కింగుకమిటీని కోరాము. ఇకమీదట జరిగే ఏ. ఐ. సి. సి. సభ అయినా ఈ తీర్మానాలను రద్దుచేయడానికి అవకాశం ఉంది.

ఈ లోగా కాంగ్రెసువారమయిన మనము తీర్మానాలవల్ల ఏర్పడే ప్రమాదకర పరిస్థితులను సోదర సభ్యులకు విశదపరచి, వారి సహాయాన్నిపొందాలి.

అధ్యక్ష రాజేంద్రప్రసాదుగారు మా అభిప్రాయాలను సానుభూతితో అర్థంచేసుకొని ఆమోదించెదరని మా ఆశ."

#### నెహ్రూ ప్రకటన

"యు. పి. రాష్ట్రీ కాంగ్రెసు అధ్యక్షునిగా నేనీ ప్రకటన చేస్తున్నాను.

కాంగ్రెసు మహాసంస్థలో ఏ. ఐ. సి. సి. సర్వాధికార సంస్థ. కాంగ్రెసు నియమావళి ప్రకారం ఈసంస్థయొక్క నిర్ణయాలకు రాష్ట్రీ కాంగ్రెసు సంస్థలు. జిల్లా సంస్థలు తలయొగ్గి ఉండాలి. అటువంటి ఈ ఏ. ఐ. సి. సి. సంస్థకు ప్రతికూలంగా బహిరంగ ప్రదర్శనలు చేయుట యుక్తమా అనే విషయాన్ని గురించి ఆలోచించాలి.

వీరీబుద్ధిని మానుకొనకపోతే కాంగ్రెసులో చీలికలు తప్పవు. ప్రజాసమరం సన్నగిలి దానిస్థానమున పార్టీకక్షలు పెంపొందును.

కుడిపక్షం వారిలో చాలమంది చాలసార్లు తప్పుచేశారు. వీరు సంకుచిత బుద్ధితో ప్రవర్తించినమాట నిజమే. మన సంస్థలోని పురోగాములను (తీవ్రవాదులను) అణచివేయడానికి వీరు ప్రయత్నించారు. ఇప్పుడు వామపక్షంవారు ప్రతిఘటింపదలచిన తీర్మానాలను కుడిపక్షమువారు ఇందుకోసమే (పురోగాములను అణచుటకు) ఉపయోగించవచ్చును. అయినను వామ పక్షంవారు చేయదలచిన పని సరియయినదికాదు. వీరి చర్యలవల్ల వీరి వాదనకు గల బలం తగ్గిపోతుంది. వీరి చర్యలనుబట్టి చూస్తే ఏ. ఐ. సి. సి. తీర్మానాలే సరియైనవి అనిపిస్తుంది.

నేనుకూడా సత్యాగ్రహ ఉద్యమాలకు సంబంధించిన తీర్మానాన్ని ప్రతిఘటించి మాట్లాడాలనుకున్నాను. కాని అవకాశం దొరకలేదు.

కాని ఇప్పుడు ఈ తీర్మానాల యోగ్యతాయోగ్యతలను గురించి ఆలోచించకూడదు. కాంగ్రెసు మహాసంస్థలోని క్రమ శిక్షణను గురించి, కాంగ్రెసు నియమావళివల్ల మన విధేయతనుగురించి ఆలోచించాలి. ఈ క్రమ శిక్షణను, విధేయతను భగ్నపరచినయెడల అస్మద్వినాశము తప్పదు."

# నెల్లూరు జిల్లా జమీన్ రైతు మహాసభ

[మా విలేఖరి]

నాయుడుపేట 7000 జనాభా గల ఒక గ్రామము. ఆ గ్రామములో జమీన్ రైతుసభ ఏర్పాటు చేయబడింది. నేను 6 వ తేదీ మధ్యాహ్నము అప్పటికైరైలు దిగి చేరేటప్పటికి అది ఒక తిరునాళ్లస్థలంగా కన్పడింది. రైలు కిటికిలనుండే ఒక ఊరేగింపు కన్పడింది. దేవాలయపు రథము మీద దేవుళ్లను లాగ ఎవరో ఇద్దరిని ఊరేగింపు చేస్తున్నారు. దాదాపు రెండు మూడువేల మంది ఊరేగింపులో ఉంటారు.

సాయంకాలం నాలు గయ్యేటప్పటికి ఊరేగింపు సభావేదికను సమీపించింది. రథమును దిగి శ్రీ బెజవాడ గోపాలరెడ్డి, శ్రీ గొ్రైపాటి బ్రహ్మయ్య వేదికను అలంకరించారు. వేదికకు ముందువైపు వేదిక అంతటి వెడల్పుగల దారి. ఆదారికి రెండువైపుల కుర్చీలు. కుర్చీల వెనుక రెండు సొమ్ముగు వెదుళ్ళను అడ్డముగా కట్టారు, వచ్చిన ప్రజాసామాన్యమంతా ఆ వెదుళ్ళను దాటి రాకుండ కూర్చోవాలని అర్ధనైజర్ల ఉద్దేశము, కాని జనము వచ్చేకొలది ఎప్పటికప్పుడు కూర్చోపెట్టడానికి వాలంటీర్లు లేకపోయారు. అందుచే వచ్చిన జనము కూర్చోక నిలబడి త్రొక్కిసలాడసాగింది. దాని మూలంగా శబ్దం ఎక్కువగా నుండి ఉపన్యాసకుల బోధలు ఎక్కువమందికి వినబడలేదు.

ముగ్గురు నల్గురు సోషలిస్టు వాలంటీర్లు ఊరేగింపులో వచ్చి కూర్చొన్నారు. జనమును వారప్పుడు వచ్చి కూర్చోపెట్టడము అసంభవము. అంతేగాదు వారిలో ఒక విషయమై నిస్పృహ, నిరాశకూడ కనబడింది. 15 దినాలుగా 45 గ్రామాలు తిరిగి, ఎండను, వానను లక్ష్యము చేయక సభకు నాలు గైదు వేల మందిని ప్రోగుచేయగల్గిన సోషలిస్టులు ఎందుకు నిరాశగ ఉన్నారా అని సందేహము కలిగింది, వారిని అడిగాను. ఏముంది! ధనిక రైతులు వెంకటగిరి జమీందారు చెప్పినట్లు పన్ను కట్టివేశారు. వారు కట్టివేయడమేగాక బీద రైతులందరికీ అప్పు ఇచ్చి చెల్లించే టట్లు బలవంతం కూడా చేసారు. అదికూడ గాక నేటి సభలో ఎట్టి రాజకీయాలు చర్చించరాదట! ఎ. ఐ. సి. సి. తీర్మానాలనుగూర్చి మా అభిప్రాయాలు రైతులకు తెలియజేయకూడదట! దానికి కారణము కలెక్టరు, సబ్-కలెక్టరు, మంత్రులు ప్రకాశం గోపాలరెడ్డిగార్లు వచ్చి సభ నలంకరించి ఉంటే వీరందరికీ రుచించని తీర్మానాలు, ఉపన్యాసాలు ఏమీ ఉండకూడదట! అని జవాబిచ్చారు.

నలు దిక్కుల కలియ జూచాను. ఎదురుగా దారి కిరు ప్రక్కల వేసిన కుర్చీలలో కలెక్టరు, సబ్-కలెక్టరు మొదలగు ఉద్యోగస్థులు, ప్రజలను కూర్చోపెట్టుతూ దండధరులైన పోలీసులు, సబ్-ఇన్‌స్పెక్టరు, సర్కిల్-ఇన్‌స్పెక్టరు కనపడ్డారు.

ఈలోపల ఎవరో దైవనామస్మరణచేశారు. మంత్రి గోపాలరెడ్డిగారికి గ్రామకాంగ్రెసుకమిటీ స్వాగతపత్రము మొదట చదివింది. మొదట తాము చదువాలనినది చదువనివ్వలేదని పంచాయితీబోర్డు అలిగిపోయిందనివిన్నాను! ఆహ్వాన సంఘాధ్యక్షుడు తన ఉపన్యాసము చదువుతూ వెంకటగిరి జమీను రైతుల కష్టాలను వివరించాడు! పోలీసుల చేసిన అన్యాయాలను బయట పెట్టాడు! ప్రభుత్వము, కాంగ్రెసు ప్రభుత్వము ఉండికూడ, ఈలాగు జమీందారునికి సహాయముగా పోలీసుల పంపడము, ప్రజలపై దౌర్జన్యము సాగించడము ఎచ్చటి న్యాయమన్నారు! వీరికంఠము చాలచిన్నది. వేదికపై రెండు గజాలలో కూర్చొనిఉన్న నాకే బహుకష్టము మీద వినబడింది. అచ్చట సమావేశమయిన ఐదువేలమందికి వారి కణగొణధ్వనిలో ఇంకేమి వినబడుతుంది!

గవర్నమెంటుయొక్క నిష్పక్షపాత బుద్ధిని శంకించి నందులకు మంత్రి గోపాలరెడ్డిగారు సహించజాలకపోయారు. తమ ప్రారంభోపన్యాసమును ఆరంభించారు. ఏదో చాల ఉపన్యసించారు. కాని వారుచెప్పిన ఈక్రింది వాక్యాలు మాత్రము జ్ఞాపకమున్నాయి. ఈ వాక్యాలు అప్పటినుండి ఇప్పటికీ చెవులలో గింగురుమంటున్నాయి. ఆవాక్యాలు విన్నపిదప శ్రీ గోపాలరెడ్డిగారు ఇంకేమి చెప్పినదీ వినేటంత ఓపిక, విన్నా ప్రయోజనముంటుందనే ఆలోచన నాకు లేకపోయింది: "మునగాలలో ఏమి జరిగిందో మీకు తెలుసుగా! అచ్చటి రైతులు సత్యాగ్రహముచేయ[illegible]. వారి ననుసరించి మీరు చేసేయనుప[illegible]ప్రస్తుత చట్టములో పేష్కసు జమీందారు పూర్తిగ ఇచ్చుకోవాలి. అందుచే మంత్రులుగా మేము వారి కష్టాలు గూడ చూడాలి. అలాగే మీకష్టాలనుగూడ మేము చూడాలి. కాని మీరుచెప్పినట్లే మేము చేయగూడదు. చేయము. మామీద, కలెక్టరు మీద మీకు విశ్వాసము లేకపోతే మీయిష్టము వచ్చినట్లు చేయవచ్చు. మాయిష్టము వచ్చినట్లు మేముచేస్తాము. ఎన్నికలు వచ్చేవరకు మీరు మమ్మేమీ చేయజాలరు."

ఈ ఉపన్యాసమిచ్చింది కాంగ్రెసుమంత్రేనా! అని సందేహము కలిగింది. ప్రజల కోర్కెలు ఏమిటో తెలుసుకోడానికి ప్రయత్నించక, వారి కష్టాలను తీర్చడానికి తమకున్న అడ్డంకులను దులిపి ప్రజల సాయమును కోరుటకు బదులు, ప్రజలను నిందించడము, ప్రజలను బెదరించడము! ప్రజలు తాముచెప్పినట్లు వినకపోతేకూడ పోలీసులవల్ల మీకెట్టి గతి పట్టుతుందోనని బెదరించడము, రాబోవు ఎన్నికలలో మాకు ఓటు ఇవ్వకపోతే పోనివ్వండి! మీయాటలు మాత్రం సాగనివ్వము! తాముచేసే పని ప్రజలకంత అయిష్టము కలిగించి, కడకు తమకు ఓట్లు కూడ ఇవ్వరేమో అన్నంత భయము సందేహము కలిగితే, అలాంటి అవకతవక చర్యలు మానుకోవాలిగాని, మేము అట్లేచేస్తాము చేస్తామని మాటిమాటికి చెప్పుకోవడము రాజకీయవేత్తకూడ చేయాలసిన పనిగాదు. ఇక ప్రజా మంత్రిగాని ప్రజా ప్రతినిధిగాని చేయవలసిన పనిగాదని వేరే చెప్పనవసరము లేదు.

శ్రీ బ్రహ్మయ్యగారు తమ అధ్యక్షోపన్యాసము ఆరంభించారు. గంటకుపైగా చెప్పారు. చాల గొడవంతా చెప్పారు. నేనూ మునగాల వ్యవహారములో ధర్మకర్తనుగా, కాదు మధ్యవర్తిగా పనిచేశాను. జమీందారు అన్యాయాలను అరికట్టినందులకు అచ్చట పనిచేసేవారిని నేను మెచ్చుకుంటాను. కాని తొందరపడవద్దన్నాను. వారు నామాట వినలేదు. సత్యాగ్రహము అరంభించారు. ఫలితమేమయింది. 80 మంది క్షమార్పణ చెప్పుకొని బయటపడ్డారు....

1930 నాటి విషయాలు ఒక్క పర్యాయము జ్ఞాపకము వచ్చింది. బోర్డ్సలు స్కూలుకు 600 మందిని సత్యాగ్రహ ఖైదీలను పంపారు. క్షమార్పణ చెప్పుకోక ఆఖరివరకు నిలిచినవారు 100 మంది మాత్రమే! జెయిళ్ళలో ఉన్న పరిస్థితులు, ఉద్యోగుల బెదరింపులు, అవమానాలు అనుభవము లేని ఎవరికైనా బయటపడేటట్లు ఆతురత గొల్పుతాయంటే ఆశ్చర్యము లేదు. అట్టి పరిస్థితులు కాంగ్రెసు మంత్రుల కాలములోకూడ జెయిళ్ళలో ఉన్నందులకు సిగ్గుతో తల వంచుకోక పైగా మునగాల వీరులను తూలనాడడము!

బ్రహ్మయ్య గారింకా చెప్పారు; కాంగ్రెసు మంత్రులు మాతో వచ్చి వారి కష్టాలు చెప్పుకుంటారు. మేము ప్రజల కష్టాలు వారి చెవిలో పడవేస్తాం. అందుచే మీకేమైనా కష్టాలుంటే మాతో చెప్పుకోండి తొందరపడవద్దు.

బ్రహ్మయ్యగారు ఉపన్యసిస్తూ ఉంటే మధ్య వచ్చి ఆసీనులైన ప్రకాశం మంత్రిపుంగవులకు ఈ మాటలు రుచించలేదు కాబోలు లేక బ్రహ్మయ్యగారి దీర్ఘోపన్యాసము విసుగు కలిగించిందో తెలియదు. కాని బ్రహ్మయ్యగారు ముగించగనే లేచారు:- నేనెపుడూ నా కష్టాలు బ్రహ్మయ్యగారితో చెప్పుకోలేదు. నే నెపుడూ ఏ కాన్ఫరెన్సుకు రాలేదు. ఇప్పటకు రావడానికి కారణము మీకు ఒక హెచ్చరిక చేయడానికే నేను ఇచ్చటికి వస్తానని తెలిసి వెంకటగిరి రాజా బెంగుళూరు నుండి ఉస్మానుసాహెబుకు ఫోనుచేసి రైతులకు పన్ను కట్టవలసినదిగా నన్నీ సభలో చెప్పేటట్లువేయమని సిఫారసు చేయించుకున్నాడు. నాకట్టి సిఫారసుల అవసరం లేదు. నేనేమిచేయాలో నాకు తెలుసు.

"నేను మీ కంతా మేలు కలిగించడానికి ఒక బిల్లు తేబోతున్నాను. అది వచ్చేవరకు మీరు ఓపికపట్టాలి. నాకు సహాయముచేయాలి. పంచాయితీ బిల్లును తేవాలని రెండేండ్లుగా ప్రయత్నిస్తూ ఉన్నాను, కాని అది డిపార్టుమెంటుల మధ్య నలిగి చస్తూ ఉంది. ఇంతవరకు బయట పడలేదు అందుచేతే మీరంతా శాంతంగా ఉండి నా కెట్టి తొందర కలిగించకుండా ఊరుకోవాలి. అంతేగాని మునగాలలో సత్యాగ్రహము చేస్తే నేను ఏమి చేయాలో నాకు తెలుసు." ప్రకాశం ముఖంకేసి చూచాను. ముఖము జేవురించిఉంది. పెదవులు వణకి పోతున్నాయి. రెండేండ్లుగా పంచాయితీ బిల్లును బయటికి రాకుండా జేస్తూ ఉన్న బ్రిటిషు ఉద్యోగులమీద కోపపడలేక, ప్రజలు, తమకష్టాలు పోగొట్టుకోడానికి ఆందోళన, సత్యాగ్రహముచేస్తే వారిపై విరుగబడడము ఎందుకా! అనుకున్నాను. పంచాయతీ బిల్లులాగనే, జమీందారీ బిల్లును కూడ కూల ద్రొక్కితే ఏమి చేస్తారు! లేక బిల్లు శాసన సభలో ప్యాసయినా, ఒరిస్సా గవర్నలాగ మద్రాసు గవర్నరూ సంతకము చేయకపోతే, అప్పుడేమి చేస్తారు! ఎందుకీ ఆగ్రహము! అధికారమంతా తమరి చేతిలో ఉన్నట్లు, మరెట్టి పోరాటము లేకనే చట్టాలన్నీ ప్రజలు పొందుతారని అనుకోవడము, తమ స్థితిని తాము మరచిపోవడమే గదా!

"పన్నులు కట్టండి, తొందరపడకండి" అని ముగించాడు. ఉన్న చట్టానికి వ్యతిరేకముగా వెళ్లారని రైతులను బెదరించారేగాని, ఉన్న చట్టానికి వ్యతిరేకంగా అక్రమ జప్తులను చేసిన పోలీసు ఉద్యోగస్థులను పల్లెత్తుమాట కూడ అనకపోవడము, ఆశతో తమ కష్టాలేవో తెలుసుకొని తమకేవో చేసిపోతాడని ఎదురుచూస్తూ వచ్చిన వేలకొలది జనులను, ఉద్యోగస్థుల ముందు, పోలీసులముందు తూలనాడడము ప్రజలను ధైర్యవంతులజేసి దేశవ్యాపక జాతీయ పోరాటానికి తయారుచేయడమేనా?

ఈ ఆలోచనలతో మునిగిపోయి ఉన్నా. శ్రీరామానాయుడుగారు తీర్మానాలను చదివివేశేస్తున్నాడు. జమీందారీ విధానాన్ని రద్దు చేయాలి. ఈ లోపల, ప్రభుత్వము జమీందారీల నన్నింటిని మేనేజ్‌చేసి ఖర్చులు పోను మిగిలింది జమీందారుల కివ్వాలని, ఇంకా చాల తీర్మానాలు. ఈ రైతులెంతో ఆశపెట్టుకొని ఎదురు చూస్తూ ఉన్న రిమీషను తీర్మానము యొక్క సారాంశము! ఎండిపోయిన పొలాల కన్నిటికి సాంప్రదాయకముగా ఇస్తూవచ్చినట్లే ఈ సంవత్సరము కూడ విధిగా పూర్తిగ రిమిషను ఇవ్వాలని ఏ యే పొలాలు ఎండిపోయినదీ తెలియజేయు లెక్కలు తప్పుడువి సృజిస్తూ ఉన్నట్లు తెలియుటచే జమీందారు తరపున ఇద్దరూ, రైతుల తరపున ఇద్దరూ, అధికార సభ్యుడు ఒకడు ఉన్న కమిటీని ఏర్పరచి అట్టి లెక్కలను తయారుచేయించవలసినది.

తీర్మానము బాగానేఉంది. కాని దీనికెట్టి విలువలేదు. తీర్మానాలన్నీ పదో పదిహేను నిముషాలలో చదివేశారు. వీనిపై ఒక్క ఉపన్యాసములేదు ఒక్కరైతూ తనగోడు చెప్పుకోడానికి వీలులేకపోయింది. మంత్రులతో పన్ను రిమిషను విషయము మాట్లాడడానికి, సభను మంత్రుల ఉపన్యాసాల పిదప పదినిముషాలలో ముగించారు. రైతులకేమి కావాలనిందీ పూర్తిగా రిమిషను ఇవ్వకపోతే పోరాటానికి తయారుగఉన్నదీ, లేక మరేమిచేయవలసిందీ, ఇట్టి విషయాలను గూర్చి ఆలోచించుకోడానికి కాదు ఆసభను జరిపింది. వచ్చిన ప్రజలు తమ కష్టాలను మంత్రులకు తెలియజేయడానికి కూడ ఆసభ వినియోగపడలేదు. ఇన్నివేలమంది తమ ఆకలిబాధవలన సమావేశమయ్యారని మంత్రులుచూచి కోపపడ్డారు. వారిని బెదరించి లొంగదీయాలనుకున్నారు. "ఆ బెదరింపులను లక్ష్యముచేయక భవిష్యత్కార్యక్రమమును నిర్ణయించుకొనక, రైతునాయకులు మంత్రుల వెంటపడ్డారు. మంత్రులు వారిని చాల తీవ్రంగా కోపపడి కడకు 0-8-0 రిమిషను ఇచ్చేటట్లు, చెల్లించలేనివారికి జనవరివరకు వాయిదా ఇచ్చేటట్లు చేస్తామన్నారని పుకారు! వచ్చిన ప్రజలు హతాశులై వెనుదిరిగి తమ ఇండ్లకు, వెంకటగిరి దరిద్రనిలయానికి మరలారు!

ఎంతకాలము అధికారములేని ఈ శాసన సభలపై విశ్వాసము! కాంగ్రెసు నాయకుల యొక్క విశ్వాసము స్వాతంత్ర్య పోరాటాన్ని భగ్నముచేస్తూంది. నాయుడుపేటసభ. ప్రజాసామాన్యమందు మనము ఇంకను ఎంతవని. ఎంత ఓపికగా చేయవలసిఉందో మరియొక పర్యాయము మనస్సుకు తెచ్చింది! విప్లవానికి మనము ఎంతదూరములోఉందీ తెలియజేసింది!

సంపుటం 2
సంచిక 30

# నవశక్తి

బుధవారం
12-7-39

సంపాదకవర్గం: మద్దుకూరి చంద్రశేఖరరావు (సంపాదకుడు), కంభంపాటి సత్యనారాయణ, పుచ్చలపల్లి సుందరయ్య, తుమ్మల వెంకట రామయ్య.

## జులై 9

జులయి తొమ్మిది తీవ్రవాదులకొక పరీక్షా దినం. ఎంతో త్యాగం, శ్రమ ఫలితంగా ప్రజా ఉద్యమ, పోరాటాల ద్వారా గడించిన కాంగ్రెసు మహాసభ కీర్తికి కళంకం తెచ్చే అఖిల భారత కాంగ్రెసు కమిటీ చేసిన తీర్మానాలను—కాంగ్రెసువాదులను ప్రజా పోరాటాలనుండి వేరు చేసే తీర్మానాన్ని, కాంగ్రెసు కమిటీలను మంత్రులకు తాబేదార్లుగా చేసే తీర్మానాన్ని—అమలుజరుపవద్దని, రద్దు చేయమని కోరుతూ ఆ రోజున భారతదేశ మంతటా సభలు జరుపమని 'తీవ్రవాద ఐక్యసంఘటన'కమిటీ తీర్మానించింది. దీనిపై వాదోపవాదాలు, రాద్ధాంత సిద్ధాంతాలు బయలుదేరాయి.

రాజేంద్రబాబు అఖిల భారత కాంగ్రెసు కమిటీ తీర్మానాలను విమర్శించుతూ కాంగ్రెసు వాదులు, కాంగ్రెసు కమిటీలు బహిరంగ సభలు చేయుట డిసిప్లినుకు విరుద్ధమని ప్రకటించాడు. గాంధీయుల పెత్తనములో వున్న వివిధ రాష్ట్ర కాంగ్రెసు కమిటీల అధ్యక్షులు కాంగ్రెసువాదులు ఆ సభలలో పాల్గొనరాదని హుకుములు జారీ చేశారు. పండిత నెహ్రూ కాంగ్రెసు తీర్మానాలను కాంగ్రెసువాదులు విమర్శించుతూ ప్రచారము చేయుట యిదివరకు కాంగ్రెసు చరిత్రలో ఎన్నడూ లేదన్నాడు. రాయ్ కూడా సభలలో పాల్గొనుట డిసిప్లినుకు వ్యతిరేకమంటున్నాడు. ఈఆక్షేపణలు ఎంత వరకు నిలుస్తాయి అనేది ప్రశ్న?

కాంగ్రెసు మహాసభ ప్రజల హక్కులకొరకు పోరాడుటచేతచే ప్రజలలో పలుకుబడి సంపాదించింది: స్వాతంత్ర్యము కోరు భారత ప్రజ లందరి సంస్థ కాగలిగింది. బొంబాయి తీర్మానాలు, కాంగ్రెసు వాదులు ప్రజా పోరాటాలలో పాల్గొనే హక్కును సంకుచితపరుస్తున్నాయి. కాంగ్రెసు కమిటీలను మంత్రులకు తాబేదారీ సంస్థలగా మార్చివేస్తున్నాయి, అందుచే కాంగ్రెసు మూలసూత్రానికి విరుద్ధమయినవి. వానిని విమర్శించి, కాంగ్రెసు సామాన్య సభ్యులలో, ప్రజలలో ప్రచారము గావించి ముందు కాంగ్రెసు మహాసభలో మార్పించుకొనే హక్కు కాంగ్రెసు వాదులకు వుంది. అట్టి హక్కు ప్రతి ప్రజాస్వామిక సంస్థలోను వుంటుంది.

నెహ్రూజీ తలంచినటుల గాక కాంగ్రెసు చరిత్రలో ఇట్టివి అనేకసార్లు జరిగాయి. గయా కాంగ్రెసులో శాసన సభా ప్రవేశ తీర్మానము ఓడిపోయిన తర్వాత స్వర్గీయ చిత్తరంజనదాస్, మోతీలాలునెహ్రూలు స్వరాజ్య పార్టీ (కాంగ్రెసులోనే) లేవదీసి శాసనసభా ప్రవేశానికి అనుకూలంగా దేశమంతటా ప్రచారం చేసికొన్నారు. 1923 సెప్టెంబరు ఢిల్లీ స్పెషలు కాంగ్రెసులో తమ తీర్మానము నెగ్గించుకొన్నారు. అటులే 1937 అక్టోబరులో కలకత్తాలో సమావేశమయిన అఖిల భారత కాంగ్రెసు కమిటీ మైసూరు సంస్థాన ప్రజా ఉద్యమానికి సానుభూతి, సహకారము చూపుతూ చేసిన తీర్మానానికి వ్యతిరేకముగా గాంధీజీ ప్రచారము సాగించాడు. గాంధీయులు తమ ప్రచార ఫలితముగానే సంస్థానాలలో కాంగ్రెసు తటస్థ విధానము వహించాలనే తీర్మానాన్ని హరిపుర కాంగ్రెసులో నెగ్గించుకోగలిగారు. పై సంగతులు స్మృతికి తెచ్చుకుంటే కాంగ్రెసు చరిత్రలో యిది మొదటిసారి కాదని స్పష్టమవుతుంది.

సంయుక్త ప్రజా సంఘటన, ప్రజా పోరాటము ఇట్టి డిసిప్లినుతోనేనా సాగించేది! అని తీవ్రవాదులను నెహ్రూ ఆక్షేపించుతున్నాడు. నిజమే! ప్రజా పోరాటాన్ని సాగించడానికే సంయుక్త ప్రజా సంఘటన! స్వాతంత్ర్య పోరాటాన్ని కొనసాగించడానికే జాతీయవాదుల ఐక్యత. కాని పోరాటాన్నే సంకుచితపరచే, బానిస రాజ్యాంగ విధానాన్ని ఆచరణలో పెట్టే విధానానికి తలలొంచడానికికాదు డిసిప్లిను. పైగా నెహ్రూ తానూ మొదట్లో ఆ తీర్మానాలకు వ్యతిరేకుడనే అనీ, అవకాశం దొరికితే కాంగ్రెసు కమిటీలో ఎదిరించే వాడినే అంటున్నాడు. తీర్మానాలు చెడ్డవని అంగీకరించినవాడు మొఖం చాటువేయక, వానిని ఓడించుటకు అఖిలభారత కాంగ్రెసు కమిటీలో ప్రయత్నించి వుండాలిసింది. అపుడు మౌనం వహించి, నేడు తీవ్రవాదులు డిసిప్లినుకు వ్యతిరేకముగా పోతున్నారు గాన ఆ తీర్మానాలు పుండతగినవే అని ప్రకటించడము అర్థంలేని వాదము.

'మహో నాయకత్వం' అనే నినాదముతో గాంధీయులపై కత్తిదూసిన రాయి తమ పార్టీకూడ తీవ్రవాద సంఘటనలో పార్టీగావుండి అంగీకరించిన కార్యక్రమాన్ని త్రోసివేసాడు. ఈ సభలలో పాల్గొనరాదని ప్రకటించాడు. రాయి యీ బోల్తా విచిత్రమయింది. ఇట్టి సమయానుకూల వాదానికి భారత రాజకీయాలలో తావులేదని రాయి ఎంత త్వరగా తెలిసికొంటే అంత మంచిది. విప్లవ నాయకత్వానికి ప్రధానమయిన ప్రజా పోరాటానికి అభ్యంతరాలు కల్పించే తీర్మానాలకు, వ్యతిరేకముగా అసమ్మతి తెలుపడానికి జంకేవాదము తీవ్రవాదం కాదు 'అపర్చునిజం' మాత్రమే.

ఎవరేమి బెదరించినా దేశమంతటా తీవ్రవాద సంఘటన కమిటీ తీర్మానుసారము అసమ్మతి సభలు జరుపబడ్డాయి. వీనిలో కాంగ్రెసువాదులు, కిసాన్‌సభవారు, కార్మిక సంఘాలు, సోషలిస్టులు, కమ్యూనిస్టులు, ఫార్వర్డుబ్లాకు, రాయిస్టులుకూడా పాల్గొన్నారు. కాంగ్రెసు మూల సూత్రానికి, ప్రజా పోరాటానికి విరుద్ధమయిన ఆ రెండు తీర్మానాలు అమలు జరుపవద్దని కోరుతూ తీర్మానించారు. రాజేంద్రబాబు కాంగ్రెసు వర్కింగు కమిటీ తమ పొరపాటును యిప్పటికైనా గ్రహించాలి. కాంగ్రెసులో చీలికలు రాకుండా చూడవలసిన బాధ్యత త్రిపురీ కాంగ్రెసు జాతీయ పంథా తీర్మానము ననుసరించి దేశాన్ని స్వాతంత్ర్య పోరాటానికి సన్నిద్ధము చేయవలసిన బాధ్యత వారిపై వుంది. తీవ్రవాదులు దేశాన్ని కదనరంగములోకి నడపమని నాయకత్వాన్ని కోరుతున్నారు. పోరాటానికి నడిపితే సంపూర్ణ డిసిప్లినుతో అనుసరించడానికి వారు సిద్ధముగా వున్నారు, పోరాటానికి పిలుపు యివ్వండి!—కాంగ్రెసులో ఐక్యత, డిసిప్లిన్ వాటంతట అవే వస్తాయి. తీవ్రవాదులు సర్వవిధాలా తోడ్పడటానికి, ఆజ్ఞలను శిరసావహించడానికి తయారుగా వున్నారు.

బొంబాయి రాష్ట్ర కాంగ్రెసు సంఘము 9 వ తేదీ సమావేశములో పాల్గొన్నందులకు అపుడే 9 గురిపై డిసిప్లినరీ చర్యలకు నోటీసు యిచ్చినటుల వార్తలు వచ్చాయి. ఇంత ఆత్మ వినాశకరమైన పని, ఐక్యతా విచ్ఛేదకమైన పని వేరొకటి వుండబోదు. ప్రజా పోరాటం కావాలనే వారిని, కదనరంగానికి పంపే ఆజ్ఞ యివ్వమ్మని కోరే తీవ్రవాదులను కాంగ్రెసునుండి వెడలగొట్టే ప్రయత్నం కాంగ్రెసు ఆశయానికే విరుద్ధం. 1906 సూరత్ కాంగ్రెసులో మితవాద నాయకులు తమ సంఖ్యాబలం వినియోగించుకొని బాలగంగాధర తిలక్ నాయకత్వాన పనిచేసే తీవ్రవాదులకు కాంగ్రెసులో స్థానంలేకుండా చేసారు. కాంగ్రెసు మహాసభనాడు గొల్పోయిన ప్రతిష్ట 1916 లో మరల తిలక్ వగయిరాలు కాంగ్రెసులో ప్రవేశించువరకు సంపాదించలేక పోయింది. ఈ పది సంవత్సరాలు కాంగ్రెసు బయటనే ప్రజల నాకర్షించిన 'హోం రూలు ఉద్యమం' జరిగింది. నేడు తీవ్రవాదులను కాంగ్రెసునుండి తరిమివేసి మరల అట్టి విషాద చరిత్రనే గాంధీయులు మరల ప్రదర్శించవద్దు.

పోరాటము లేకుండానే క్రమ క్రమముగా అధికారము హస్తగతము అవుతుందనే భ్రమలు ఎంత త్వరగా మానితే అంత మేలు. బ్రిటిషు ప్రభుత్వము యుద్ధానికి ప్రయత్నాలు భారతదేశములో ప్రారంభించింది. రాబోవు యుద్ధములో భారత దేశాన్ని తూర్పు దేశాల్లో కేంద్రముగా వుంచుకోడానికి నిశ్చయించుకొని ఆయుధ ఫ్యాక్టరీలు నిర్మించుతూ వుంది. రాబోవు యుద్ధములో భారత రక్తాన్ని, ధనాన్ని సామ్రాజ్యవాదుల ఉపయోగానికి ధారబోయకుండా చేయడానికి ఒకటే మార్గము, నేటి నుండి స్వాతంత్ర్య పోరాటానికి సన్నాహాలు చేయాలి. ప్రజా హక్కులకై జరుగు పోరాటాలలో కాంగ్రెసువాదులు, కమిటీలు పాల్గొని నాయకత్వము వహించాలి. కాంగ్రెసు మంత్రులు బ్రిటిషు శాసనాలను అమలు జరుపుటకు గాక ప్రజా హక్కులను రక్షించడానికి, ప్రజా పోరాటశక్తిని వృద్ధి చేయడానికి తోడ్పడాలి. కాంగ్రెసు నాయకత్వము, "కానిస్టిట్యూషనలు" ఎడారి మార్గాలను వదలి విప్లవ ప్రజా పోరాటానికి దారి తీయాలనీ, కాంగ్రెసు ఐక్యతను కాపాడాలనీ ఆశించుతాము.

# మన రాజకీయాలు

**ఇండియాలో యుద్ధసన్నాహాలు**

ఇండియాలో ఎట్టి మిలిటరీ సంస్కరణలు అవసరమో సూచిస్తూ కొన్ని సిఫార్సులు చేసిన చాట్‌ఫీల్డు కమిటీవారి రిపోర్టును బ్రిటిషు ప్రభుత్వము ఆమోదించిందని వార్తలు ప్రకటించబడ్డాయి. గ్రేటుబ్రిటనులో ఉన్న ఆయుధ కర్మాగారాలు బ్రిటిష్ సైనికులకు కావలసిన సామగ్రినే సప్లయి చేయవలసియున్నందున, ఇండియా "రక్షణ"కు అవసరమైన సామగ్రిని తయారు చేయడానికి ఇండియాలోనే "ఆయుధ కర్మాగారాలను ఎక్కువ చేయడము, ఉన్నవాటిని వృద్ధి చేయడము, అవసర" మని ఆకమిటీ సిఫార్సు చేసిందట. ఈసిఫార్సులు ఆచరణలో పెట్టడానికి అప్పుడే సన్నాహాలు కూడా జరుగుతున్నాయి. యుద్ధము వచ్చినప్పుడు ఇండియాను శత్రువులబారినుండి కాపాడడము కాదు, బ్రిటిషువారి ఉద్దేశము. తమ సామ్రాజ్యాన్ని కాపాడుకొనేటందుకు ఇండియాను ఒక సాధనముగా వినియోగించుకోవడమే వారి ఆశయము. ఇటీవల సింగపూర్‌లో జరిగిన బ్రిటిషు—ఫ్రెంచివారి సైనికాధికారుల సమావేశం ఇట్టి నిర్ణయానికే వచ్చిందని టైమ్సు పత్రికా విలేఖరి తెలియజేశాడు. ఇంతే కాదు. కొద్ది రోజులలో ఇండియా—బర్మా దేశాల సైనికాధికారులు సిమ్లాలో సమావేశము కాబోతున్నారు. సైకిమాత్రము ఉభయదేశాల రక్షణకు ఎట్టి పద్ధతు లవసరమో ఆలోచించడానికి ఈ సమావేశము జరుగుతూన్నదని ప్రకటించబడుతూన్నా, బర్మాను ఇండియాతో కలిపి బ్రిటిషు సామ్రాజ్య రక్షణకు ఏయే పనులు చేయాలో ఆలోచించడానికే ఈ సమావేశము జరుగుతూంది.

మన ఆంధ్ర దేశంలో కూడా, నెల్లూరు, గుంటూరు మొదలయిన జిల్లాలలో సైనికుల్ని చేర్చుకోవడము, వారికి తరిఫీదు యివ్వడముకూడా జరుగుతూన్నట్లు వార్తలు వస్తున్నాయి.

కాబట్టి, ఇండియాలో యుద్ధ సన్నాహాలు రహస్యముగా జరగడంలేదు. ఏ నిమిషాన్ని యుద్ధం వచ్చినా ఇండియాను తమ సామ్రాజ్య రక్షణకై ఉపయోగించుకొనడానికి బ్రిటిషువారు అన్ని యేర్పాట్లు చేసుకుంటున్నారు.

**సంస్థానాధీశుల రెండో సమావేశం**

ఇట్టి సన్నాహాలకు మన సంస్థానాధీశులు కూడా తోడ్పడనిదే తమ ప్రభుత్వము నిలువదని వారికి బాగా తెలుసు. జూన్ 12 వ తేదీని బొంబాయిలో మొదట సమావేశమయిన సంస్థానాధీశులు ఫెడరేషన్‌లో తమకు కావలసిన రక్షణలు యివ్వబడేవరకు ఫెడరేషన్‌లో చేర నిరాకరించారు. కాని, సిమ్లాలో నిన్న వీరు రెండవసారి సమావేశమై, తమ తీర్మానాన్ని ఉపసంహరించుకొనడానికి తయారవుతున్నారు. దక్షన్ సంస్థానాధీశుల సమావేశం యిదివరకే ఫెడరేషన్‌లో చేరడానికి తీర్మానించింది. రాజపుత్ర స్థానంలో ఒక్క బికనీర్ తప్ప మిగిలిన జైపూర్, జోధపూర్, ఉదయపూర్, భరత్‌పూర్, బుంది, కిషన్‌గర్, కోట— సంస్థానాధీశులు యిటీవల వైస్రాయికి తమ ఆమోదాన్ని తెలియజేశారట. పాటియాలా సంస్థానాధీశుడు మొన్న 9 వ తేదీని పంజాబు సంస్థానాధీశుల సమావేశములో ఫెడరేషన్‌ని అంగీకరిస్తూ ప్రతిపాదించిన తీర్మానము ఏకగ్రీవంగా ఆమోదించబడింది. ఈస్టరన్ ఏజన్సీ సంస్థాన ప్రభువులు కూడా యిట్టి నిర్ణయానికే వచ్చారు. సిమ్లాలో యిప్పుడు సమావేశమైయున్న సంస్థానాధీశులంతా వైస్రాయియొక్క సౌమనస్యం మీదనే పూర్తిగా విశ్వాసము ఉంచి, తమకు కావలసిన మార్పులన్నింటికీ వైస్రాయి అంగీకారాన్ని సంపాదించడానికే నిశ్చయించుకున్నట్లు యూథివార్తలు వస్తున్నాయి. కాబట్టి, సంస్థానాధీశులు ఫెడరేషన్‌లో తప్పక చేరుతారని విశ్వసించవచ్చు.

**ముస్లింలీగ్ వైఖరి**

ఈవిధముగా సామ్రాజ్యవాదులు, వారి ఏజెంట్లు, ఏదోవిధముగా సమాధానపడి రాబోయే యుద్ధములో భారతీయుల్ని ఆహుతిచేయడానికి నిశ్చయించుకొని కూర్చుంటే, ఇండియాలో జాతీయ ప్రతికూల శక్తులకు చెందిన ముస్లిములీగ్ నాయకులుకూడా ఈ ప్రయత్నాలకుతోడ్పడుతున్నారు. ఈనెల 3 వ తేదీని బొంబాయిలో జరిగిన ముస్లిములీగ్ కార్యనిర్వాహకవర్గము కొన్నితీర్మానాలు చేసింది. జైపూర్ సంస్థానములో మహమ్మదీయ ప్రజలు ప్రారంభించిన శాసనోల్లంఘనోద్యమాన్ని విరమింప జేయవలసిందని ఒక తీర్మానము; హైదరాబాద్ సంస్థానములో ఆర్యన్ సమితివారిచే సాగించబడుతూన్న సత్యాగ్రహము ఆపుచేయకపోతే ప్రతిచోటా హిందూ—ముస్లిము కొట్లాటలను రెచ్చగొట్టుతాం అని బెదరిస్తూ మరొక తీర్మానము—ప్యాసు చేయబడ్డాయి. ప్రజా ఉద్యమాలలో మహమ్మదీయులు పాల్గొన్నా, హిందువులు పాల్గొన్నా నిరంకుశపరిపాలకులు, బ్రిటిషు ప్రభుత్వము వాటివల్ల బలహీన మవుతాయని జిన్నా ప్రభృతులకు తెలుసు. కనుకనే ప్రజా పోరాటాలను భగ్నము చేయడానికి పూనుకున్నారు.

**పంజాబులో నిర్బంధ విధానం**

ఇంతే కాక, సంస్థాన ప్రజా ఉద్యమాన్ని అణచి విదేశీ పరిపాలకులకు సహాయము చేసే ఉద్దేశముతో పంజాబు జాతీయ ప్రతికూల ప్రభుత్వము ప్రిన్సెస్ ప్రొటెక్షన్ ఆక్టును విచ్చలవిడిగా ఆచరణలో పెట్టుతూంది. నేకీరాంశర్మ అనే కాంగ్రెసునాయకుడు సంస్థాన ప్రజల విషయమై ఎట్టి ఉపన్యాసాలు ఇవ్వకూడదని ప్రభుత్వం ఉత్తర్వు జారీ చేసింది. రాజద్రోహానికి మురళీమనోహర్ అనేమరొక కాంగ్రెసు నాయకుడు ఎరస్టు చేయబడ్డాడు. 144 వ సెక్షను ధిక్కరించినందుకు లాహోర్ రైతుల్ని ప్రతిరోజు ఎరస్టు చేస్తున్నారు మొత్తం 3 వేలమంది వరకూ ఎరస్టు కాబడ్డారు. వీరు గాక, 310 మంది మోగా రైతు సత్యాగ్రహుల్ని పంజాబు ప్రభుత్వము ఎరస్టు చేసింది.

**బెంగాల్‌లో రాజకీయ ఖైదీల నిరశన వ్రతం**

కాంగ్రెసు ప్రతికూల మంత్రివర్గం అధికారములో ఉన్న బెంగాల్‌లోకూడా యిదే ధోరణి. 150 మందికి పైగా రాజకీయ ఖైదీలు బెంగాల్ జైళ్ళలో మ్రగ్గుతున్నారు. వారి విడుదలకై యిటు గాంధీజీ, అటు బెంగాల్ కాంగ్రెసు నాయకులు ఎన్ని ప్రయత్నాలు చేసినా ప్రయోజనం కలుగలేదు. అందుపై డండం, అలిపూర్, జైళ్ళలో ఉన్న 86 గురు రాజకీయ ఖైదీలు మొన్న 7 వ తేదీని నిరశనవ్రతము ప్రారంభించారు. వెంటనే రాజకీయ ఖైదీలందర్నీ విడుదల చేయకపోవడమే యీ నిరశన వ్రతానికి కారణం. తాము క్రమ క్రమంగా, ఒక్కొక్కరినే, విడుదల చేసే విధానానికి యీనిరశనవ్రతం ఆటంకము కాబట్టి దానిని ఆపుచేసేవరకు ఎవరినీ విడుదలచేయం అని బెంగాల్ హోం మంత్రి ప్రకటించాడు. కాని, బెంగాలు ప్రజలుగాని, బెంగాలు కాంగ్రెసు నాయకులు గాని, యీ ప్రకటనకు భయపడక, జూలై 15 వ తేదీని రాష్ట్రం అంతటా నిరసన సభలు చేయవలసిందని రా. కాం. కమిటీ సభ్యులకు పంపించింది.

ఇతర రాష్ట్రాలలో మాదిరి కాకుండా, బెంగాలు కాంగ్రెస్ నాయకులు పార్లమెంటరీ కార్యక్రమానికి ప్రజా ఉద్యమం జతపరుస్తూ ఏ విధముగా కాంగ్రెసు కార్యక్రమాన్ని ఆచరణలో పెడుతున్నారో చూపడానికి యిదొక నిదర్శనము.

ఇదే విధంగా, జాతీయ ప్రతికూల శక్తులకు మెజారిటీ నిచ్చే కలకత్తా మ్యునిసిపల్ బిల్లును ప్రతిఘటించడానికి కలకత్తా పురవాసులచేత పన్నుల నిరాకరణోద్యమము, సత్యాగ్రహం, చేయించడానికి కాంగ్రెసు నాయకులు తీవ్రంగా ఆలోచిస్తూన్నట్లు తెలుస్తోంది.

**కలకత్తా చీకటికొట్టు**

రెండు శతాబ్దాల క్రితము "కలకత్తా చీకటి కొట్టు" అనే ఒక గదిలో అనేకమంది ఆంగ్లేయుల్ని పెట్టి తాళము వేయడమువల్ల వారందరూ మర్నాటికి చచ్చిపోయారంటూ కథ ఒకటి అల్లి భారతీయుల మీద అపవాదులు కల్పించడానికి స్మారక చిహ్నము ఒకటి ఏర్పరిచారు. కాని ఆ కథ ఆధారరహితమయిందని ఎంతోమంది చరిత్రకారులు నిరూపించారు. కాబట్టి యిప్పుడా స్మారక చిహ్నము కలకత్తాలో ఉండడంవల్ల భారతీయులందరికీ అవమానకరము కాబట్టి బెంగాల్ ప్రభుత్వము వెంటనే దానిని తొలగించాలంటూ హిందువులు, మహమ్మదీయులు కలిసి బ్రహ్మాండమైన ఆందోళన ఒకటి లేవదీశారు. కలకత్తా, ఢక్కా మొదలైన పట్టణాల్లో బహిరంగ సభలు జరుగుతున్నాయి.

**కాంగ్రెసు రాష్ట్రాలలో**

ఈవిధముగా, కాంగ్రెసేతర రాష్ట్రాలలో ప్రజా చైతన్యము వృద్ధిచెంది కాంగ్రెసు కార్యక్రమాన్ని ఆచరణలో పెట్టడానికి ప్రయత్నాలు జరుగుతూంటే, కాంగ్రెసు రాష్ట్రాలలో మంత్రులు ఇట్టి ప్రజాభిప్రాయానికి లొంగి కొన్ని ప్రజాహితకార్యాలు చేస్తున్నారు. బీహార్ రాష్ట్రములో, కోఆపరేటివ్ సంస్థలలో సభ్యులుగా ఉన్నవారి 180 లక్షల రూపాయల బాకీలో 1 కోటి రూపాయలు చెల్లించనక్కరలేకుండా ప్రభుత్వము సదుపాయం కలుగజేయవలసిందని ఉపసంఘ సభ్యులు సిఫార్సు చేశారు. ఇందువల్ల వచ్చే నష్టములో నాల్గవవంతు అప్పులిచ్చినవారు, మిగిలిన సొమ్ము ప్రభుత్వం, భరించాలని వారు సూచించారు. ప్రభుత్వము యీసూచనలను త్వరలో ఆచరణలో పెట్టవచ్చును. ఇటు మలబార్ ప్రాంతములో రైతులు జమీందార్ల దౌర్జన్యాలను ఎదుర్కొంటూ, ప్రస్తుతమున్న ఆక్టును మార్చవలసినదిగా సుమారు 1 సంవత్సరమునుంచి చేస్తూన్న ఆందోళనా ఫలితంగా, మద్రాసు ప్రభుత్వం 20మందితో కూడిన విచారణ సంఘం ఒకదాన్ని నియమించింది. ఆ ప్రాంతపు జమీందారీ రైతుల స్థితిని గురించి వీరు సాక్ష్యం తీసుకొని చిత్తుబిల్లు ఒకటి తయారు చేస్తారు.



# ఫార్వర్డుబ్లాక్-సోషలిస్టులు

కామ్రేడ్ మద్దుకూరి చంద్రశేఖరరావు

"ఫార్వర్డుబ్లాకులో సోషలిస్టులు చేరుతారా?" అనీ "ఎందుకు చేరరు?" అనీ, ప్రతివారూ సోషలిస్టులను ప్రశ్నించుతున్నారు. ఇంతేకాదు, కొందరు కాంగ్రెసు సోషలిస్టుపార్టీలోని సామాన్యసభ్యులు కూడా యిదే ప్రశ్నను నాయకులను అడుగుతున్నారు. ఈప్రశ్నలకు సాకల్యముగా జవాబు చెప్పాలంటే (1) ఫార్వర్డుబ్లాకు ఏపరిస్థితుల్లో ఏర్పడింది? (2) సోషలిస్టులుకోరే తీవ్రవాదుల ఐక్యతను ఫార్వర్డుబ్లాకు సంపూర్ణముగా నెరవేరుస్తుందా? (3) ఇపుడు ఫార్వర్డుబ్లాకుతో సోషలిస్టు పార్టీకిఉన్న సంబంధం ఏమిటి? అనే సంగతులు తెలసికోవాలి. తరువాత సోషలిస్టులు కమ్యూనిస్టులు ఫార్వర్డుబ్లాకులో చేరాలా? అక్కరలేదా? అనేసంగతులు సులభంగా తేలుతాయి. మరి సోషలిస్టులు ఫార్వర్డు బ్లాకుతో ఎట్టి సంబంధం కలిగివుండాలి? తీవ్రవాదులందరియొక్క ఐక్యతను సాధించిన "తీవ్రవాదుల సంఘటన" (లెఫ్ట్ కన్‌సాలిడేషన్)లో ఫార్వర్డు బ్లాకుతో కలసి సోషలిస్టులు ఎలా పనిచెయ్యాలో స్పష్టపడుతుంది.

## ప్రథమ ప్రయత్నం

త్రిపురీ కాంగ్రెస్ మహాసభకు ముందే కమ్యూనిస్టులు తీవ్రవాదులందరు అంగీకరింపబడిన కార్యక్రమంపై కలసి పనిచేయడానికి లెఫ్ట్ బ్లాకు ఏర్పరచాలని సూచించారు. ఈబ్లాకు పార్టీలోవలెగాక వివిధగ్రూపుల (సోషలిస్టులు, కమ్యూనిస్టులు, కిసాన్ సభవారు, రాయిస్టులు, తీవ్రజాతీయవాదులు) కలయికగా మాత్రమే వుండాలనీ, నిర్ణయాలు మెజారిటీనిబట్టిగాక, అన్ని గ్రూపులఅంగీకారంతోచేయబడాలనీసూచించారు కాని యీసూచనను సోషలిస్టుపార్టీ కార్యనిర్వాహకవర్గంఅంగీకరించలేదు. మసానీ, పట్వర్ధన్ ప్రభృతులు తీవ్రవాదులను సంఘీకృతంచేస్తే మితవాదులతో వివాదం వృద్ధి అవుతుందనీ, కాంగ్రెసు నంతనూ తీవ్రవాదానికి మార్చే ప్రయత్నాలకు యిది ఆటంకం అవుతుందనీ, సోషలిస్టుపార్టీకి ప్రత్యర్థి అవుతుందిగాన పనికేరాదనీ కమ్యూనిస్టుల సూచనను ఎదిరించారు. తీవ్రవాదులఐక్యత, కాంగ్రెస్ ఐక్యతకూ, జాతీయ ఐక్యతకూ దారితీస్తుందనీ, ఐక్యత స్వాతంత్ర్య పోరాటాన్ని ఉపక్రమించడానికి పునాది అవుతుందనీ కమ్యూనిస్టుల వాదన. దానిని వీరు నిరాకరించారు. అంతటితో మొదటిసారి లెఫ్ట్‌బ్లాకు ఏర్పరచే ప్రయత్నాలు విఫలమయ్యాయి.

## త్రిపురీ కలకత్తాలలో

త్రిపురీ కాంగ్రెస్‌లో తీవ్రవాదులు ఏకాభిప్రాయానికి రాలేక పోవడము గందరగోళానికి కారణమయింది. గాంధీయులు విజయంపొందారు. తరువాత కమ్యూనిస్టులు, సోషలిస్టులు సంయుక్తనాయకత్వం కావాలనీ, కాంగ్రెసు ఐక్యత కాపాడాలనీ వాదించారు. రాయిస్టులు మరోనాయకత్వం కావాలనే నినాదం లేవనెత్తారు. కొందరు తీవ్రజాతీయవాదులు కూడా వీరివలెనే మరోనాయకత్వంవల్లనేగాని పోరాటం సాధ్యంకాదని వాదించసాగారు. తీవ్రవాదులలో అత్మవినాశకరమైన యీ భేదాభిప్రాయాలను అవకాశంగా తీసికొని గాంధీయులు అఖిలభారత కాంగ్రెస్ కమిటీ కలకత్తా సమావేశములో రాజీకి అంగీకరించక భీష్మించి, బోసు రాజీనామా యిచ్చే పరిస్థితులు కలిగించారు. బోసు, నెహ్రూలు సైతంలేని సంపూర్ణ మితవాద వర్కింగు కమిటీని నియమించుకొన్నారు

కలకత్తాలో గాంధీల విజయం తరువాత మరల తీవ్రవాదుల ఐక్యతకొరకు అంతా ప్రయత్నించసాగారు. రాయి మరోనాయకత్వపు నినాదంతో రాడికల్ లీగ్ లేవదీశాడు. తీవ్రవాదులు అందరిని ఐక్యపరచే కార్యక్రమం యివ్వకపోవుటచే ఇది కేవలం రాయిస్టుల ముఠాగా తయారయింది.

సుభాసుచంద్రబోసు ఫార్వర్డుబ్లాకు ఏర్పరచాడు. దీనిలోనికి తీవ్రజాతీయ వాదులంతా (కమ్యూనిస్టులు, సోషలిస్టులు, రాయిస్టులు మినహా) చేరారు లేక చేరడానికి సిద్ధపడుతున్నారు. ఫార్వర్డుబ్లాకు యితర తీవ్రవాద పార్టీలతో కలసి పని చేయడానికి 'తీవ్రవాద సంఘటనలో' చేరాలని సోషలిస్టులు, కమ్యూనిస్టులు సూచించారు. కాని సుభాసు చంద్రబోసు ఫార్వర్డుబ్లాకే తీవ్రవాదుల సంఘటనగా వుండాలని పైసూచనను త్రోసివేసాడు.

## ఎట్టకేలకు ఐక్యత కుదిరింది.

బొంబాయి సమావేశంలో మరల తీవ్రవాదుల ఐక్యత సాధించడానికి ప్రయత్నాలు చేయబడ్డాయి. సోషలిస్టులు, కమ్యూనిస్టులు ఫార్వర్డు బ్లాకులో చేరడానికి, ఫార్వర్డుబ్లాకునే "తీవ్రవాదుల సంఘటన"గా చేయడానికికూడ అంగీకరించుతూ యీ సూచనలుచేసారు. (1) ఫార్వర్డుబ్లాకు తీవ్రవాదులందరి ప్లాట్‌ఫారంగా వుండాలి గాని పార్టీగావుండరాదు. (2) దీనిలో కమ్యూనిస్టులు, సోషలిస్టులు, రాయిస్టులు, పార్టీలుగా చేరుతారు. (3) వివిధ కాంగ్రెస్ కమిటీలలోని తీవ్రజాతీయ వాదులు వ్యక్తులుగా ఫార్వర్డుబ్లాకులో చేరాలి. (4) సోషలిస్టు, కమ్యూనిస్టు రాయిస్టు ప్రతినిధులను ఆయా పార్టీల కమిటీలే నిర్ణయించాలి (5) వ్యక్తిగతంగా చేరినవారి ప్రతినిధులను ఆయా కాంగ్రెసు కమిటీలో (పై పార్టీలకు చెందని) తీవ్రజాతీయవాదులే ఎన్నుకోవాలి. (6) పైపార్టీల ప్రతినిధులు, తీవ్రజాతీయవాద ప్రతినిధులు కలసి అన్నిగ్రూపుల అంగీకారంతో నిర్ణయాలు చెయ్యాలి. మెజారిటీతో నిర్ణయించబడరాదు. కాని యీ సూచనలను ఫార్వర్డుబ్లాకు నాయకులు అంగీకరించలేదు. వారి కాన్ఫరెన్సులో, ఫార్వర్డుబ్లాకు ప్రత్యేక పార్టీగా నిర్మాణము చెయ్యాలని తీర్మానించారు. "తీవ్రవాదుల సంఘటన"లో ఒక ప్రత్యేక పార్టీగా ఫార్వర్డు బ్లాకు చేరడానికి మాత్రం అంగీకరించారు.

అందుచే ఫార్వర్డుబ్లాకునే తీవ్రవాదుల సంఘటనగా చేయకపోవడానికి సోషలిస్టులు, కమ్యూనిస్టులు బాధ్యులుకాదు. సోషలిస్టులు, కమ్యూనిస్టులు తమ పార్టీలను వదలుకొని వ్యక్తులుగా ఫార్వర్డుబ్లాకులో వ్యవహరించడానికి అంగీకరించలేదు. వారు సోషలిస్టులు కమ్యూనిస్టులుగా వున్నంతకాలం తమ పార్టీలకు బాధ్యతనుండి తప్పించుకోలేరు. ఇతర సంస్థలలో వ్యక్తులుగా వ్యవహరించ జాలరు. ఇపుడు పనిచేయుచున్న కార్మిక, కర్షక సంఘాలలోను, కాంగ్రెసులో కూడ పార్టీలుగానే పని చేస్తున్నారు. లెఫ్ట్‌బ్లాకు, కాంగ్రెసులోని తీవ్రవాదులందరు కలసి పనిచేసి జాతీయ ఐక్యతను కాపాడి, స్వాతంత్ర పోరాటానికి పుపక్రమించడానికి కాంగ్రెసు మహాసభచే అంగీకరింపజేయుటకు ఏర్పడిన ప్లాట్‌ఫారమ్‌గా వుండాలి. ఈ తాత్కాలిక కార్యక్రమాన్ని అంగీకరించిన వివిధ ఆదర్శ ఆశయాలు కలిగిన కాంగ్రెసులోని గ్రూపులు—సోషలిస్టులు, కమ్యూనిస్టులు, కిసాన్ సభవారు—రాయిస్టులు—యిందులో చేరవచ్చును. కాని తమ పార్టీలకు బాధ్యతనుండి తప్పించుకో జాలరు. వ్యక్తులుగా వ్యవహరించలేరు. పై గ్రూపులకు చెందని తీవ్రజాతీయవాదులు వ్యక్తులుగా చేరవచ్చును. ఇట్టి లెఫ్ట్ బ్లాకుగా ఫార్వర్డు బ్లాకును చేయడానికి బోసు అంగీకరించలేదు అతడు ఫార్వర్డుబ్లాకును తీవ్రజాతీయ వాదుల పార్టీగా చేయగోరుతున్నాడు. అందుచేతనే 'తీవ్రవాదుల సంఘటన' (Left Consolidation) ఫార్వర్డుబ్లాకుకు బయట ఏర్పడవలసి వచ్చింది. యీ తీవ్రవాదుల సంఘటనలో సోషలిస్టుపార్టీ, ఫార్వర్డుబ్లాకు ప్రతినిధులు, కమ్యూనిస్టుల, కిసాన్ సభవారి ప్రతినిధులు, రాయిస్టుల ప్రతినిధులు వుంటారు. అన్నిగ్రూపులు అంగీకరించిన కార్యక్రమంపై యీసంస్థ పనిచేస్తుంది. ఈవిధంగా చివరకు తీవ్రవాదుల ఐక్యత సాధింప బడుట అందరూ సంతసింప వలసిన విషయం.

## తీవ్రవాదుల సంఘటన.

## (Left consolidation)

ఇపుడు ఏర్పర్చబడిన తీవ్రవాదుల సంఘటన కమిటీ (**Left consolidation Committee**)కి సుభాస్‌చంద్రబోసు నాయకుడు, సమావేశకర్త. సభ్యులు:- జయప్రకాశనారాయణ, ఆచార్య నరేంద్రదేవ్, మెహరల్లీ (సోషలిస్టు పార్టీ); పూర్ణచంద్ర జోషీ, భరద్వాజ్, సోమనాథ లాహిరీ (కమ్యూనిస్టులు); స్వామీ సహజానంద, ఆచార్యరంగా (కిసాన్ సభ); సత్యనారాయణ్ బక్షీ; విశ్వంబర దయాళ్ త్రిపాఠీ (ఫార్వర్డ్‌బ్లాకు); ఎం. ఎన్. రాయి, భూపేన్ సన్యాల్, వి. బి. కార్నిక్ (రాయిస్టులు).

ఇక సోషలిస్టులకు, ఫార్వర్డుబ్లాకుకు గల సంబంధం విషయంలో ఎవరికి సందేహం వుండదనుకొంటాను. సోషలిస్టులు పార్టీ సభ్యులుగా వున్నంతకాలం ఫార్వర్డుబ్లాకులో చేరజాలరు. ఏమంటే సోషలిస్టుభావాలు కలిగివున్నంతకాలం వారు ఫార్వర్డుబ్లాకులో వ్యక్తులుగా వ్యవహరించలేరు. అలావ్యవహరించడం సోషలిజాన్ని వదలి కేవలం తీవ్ర జాతీయ వాదులుగా మాత్రం తయారవుటయే అవుతుంది. సోషలిస్టుపార్టీ సభ్యులు సోషలిస్టు ఆదర్శాన్ని వదలుకోరు కాబట్టి ఫార్వర్డుబ్లాకులో చేరరు.

## ఆంధ్ర సోషలిస్టుల కర్తవ్యం.

అయితే ఫార్వర్డుబ్లాకుతో స్థానికంగా సోషలిస్టులు ఎలా ప్రవర్తించాలి? అని అడుగవచ్చు. ఫార్వర్డుబ్లాకుతో ప్రజాపోరాటానికి సంబంధించినంతవరకు సంపూర్ణ సహకారం చేస్తారు సోషలిస్టులు. రాష్ట్రాలలోను, జిల్లాలలోను వివిధ కాంగ్రెసు కమిటీలలో కలసి పనిచేయడానికి 'తీవ్రవాదుల సంఘటన' కమిటీలు ఏర్పరచాలి. వీనిలో ఫార్వర్డుబ్లాకు ప్రతినిధులు, సోషలిస్టు కమ్యూనిస్టు ప్రతినిధులు, కిసాన్ సభవారు రాయిస్టులు, వుంటారు. నిర్ణయాలు అందరి అంగీకారంపై చేయబడతాయి. ఈ కమిటీ తీవ్రవాదులను కాంగ్రెసునుండి తరుము గాంధీయుల ప్రయత్నాలను ఎదిరించుతుంది. ప్రజా పోరాటాన్ని పెంపొందింపజేసి గాంధీయుల దిగజారుడు విధానాన్ని, కాన్‌స్టిట్యూషనల్ తత్వాన్ని ఎదిరించి కాంగ్రెసువాదులలో అత్యధిక సంఖ్యాకుల సమ్మతిని స్వాతంత్ర్య పోరాటానికి అనుకూలంగా సంపాదించుతుంది.

ఆంధ్రదేశంలో పై కార్యక్రమాన్ని నెరవేర్చడానికి సోషలిస్టుపార్టీ ఫార్వర్డుబ్లాకుతో సహకారం చేస్తుంది. అంతేగాని పార్టీసభ్యులెవ్వరు ఫార్వర్డుబ్లాకులో సభ్యులుగా చేరకూడదు. పార్టీప్రతినిధులు రాష్ట్రంలోనూ, వివిధజిల్లాలలోను ఏర్పడు ఫార్వర్డుబ్లాకు కమిటీలతో సంప్రదించి రాష్ట్ర, జిల్లా "తీవ్రవాద సంఘటన కమిటీ"లను ఏర్పరచాలి. ఇవి రాష్ట్ర, జిల్లా కాంగ్రెసు కమిటీలలో తీవ్రవాదులందరు అవలంబించవలసిన కార్యక్రమాన్ని నిర్ణయించి జాతీయ పోరాటాన్ని పుపక్రమించడానికి కాంగ్రెసువాదుల సమ్మతి సంపాదించాలి. రాబోవు యుద్ధాన్ని, ఫెడరేషను ఎదుర్కొనుటకు ప్రజానీకాన్ని తయారు గావించాలి.

తీవ్రవాదులఐక్యసంఘటన కాంగ్రెసు సంఘాలలో తీవ్రమైన తీర్మానాలు ఉపపాదించుటతో సంతృప్తి పడరాదు. గాంధీయులవలెనే కాంగ్రెసు సభ్యులను చేర్పించడంలో స్వంత డబ్బుతో చేర్పించుట వగైరా కృత్రిమ పద్ధతులు అవలంబించరాదు. గాంధీయులతో పోరాటమే ప్రధానంగా యెంచరాదు. కాంగ్రెసువాదులందరిలోనూ, ప్రజాసామాన్యంలోను దిగజారుడు విధానం రాజీకి ఎలా దారితీస్తుందో ప్రచారం గావించాలి. రాజీకివిరుద్ధంగా సామాన్య కాంగ్రెసు వాదులందరి సమ్మతిని సంపాదించాలి. కార్మిక, కర్షకుల హక్కులకొరకు పోరాటాలద్వారా దిగజారుడు విధానానికి వ్యతిరేకంగా ప్రజాబలాన్ని సంపాదించాలి. అపుడే లక్షలకొలది కాంగ్రెసు వాదులను ప్రస్తుత నిస్పృహ స్థితినుండి మేల్కొల్పి స్వాతంత్ర్య పోరాటానికి దారితీయగలుగుతాము.

# భోగాపురంలో వయోజన విద్యా ప్రచారం

## విద్యార్థులు గురువులు! పెద్దలు శిష్యులు!!

విద్యార్థి ఫెడరేషన్ వారి అనుభవాలు

కామ్రేడ్ జి. రామకోటేశ్వరరావు

వేసంగి సెలవులు ప్రారంభము. ఆంధ్రరాష్ట్ర ఫెడరేషనువారి యాజమాన్యమున భోగాపురములో (విజయనగరము దగ్గర) వయోజన విద్యాప్రచారము జరగబోతుంది. ఒక్క నయగులో ఎప్పుడు యీ పట్టణాన్నుంచి బయటపడి శాంతియుతమైన ఆ అమాయిక ప్రజల మధ్య పడదామా అని ఉవ్విళ్ళూరుతూ బస్సుఎక్కాను. విశాఖపట్నంలో అనేక అవాంతరాలు గడచి బస్సు భోగాపురము సమీపిస్తున్నకొద్దీ నా మనసు ఆతురత హెచ్చింది.

భోగాపురము 5000 జనాభా గల ఒక కుగ్రామము. నిరంకుశులైన జమీందారు పరిపాలనలో ఉన్నది. బస్సు దిగగానే రోడ్డుకి ఒక ప్రక్కగా చిన్న గుడిసెలు, పెద్ద పాకలు, పూరిళ్లు, ఏవో కొన్ని పెంకుటిళ్లు, కనపడ్డవి. అక్కడ మా సామానులు మోసే వాళ్లు గూడా యెవరూలేరు. "ఈ వూళ్లోరెండు నెలలుండాలి" అని కించిత్తు విచారముతో మా సామానులు మేమే మోసుకొని రాజవీధి వెంబడి నడుస్తున్నాము. మా వింత ఆకృతులను చూచి ఒక్కొక్కరే ఆ వూళ్లో జనము మా వెంట వస్తున్నారు. కాని ఒక్కరూ మాతో మాట్లాడడానికి సాహసించలేదు. ఇంతలోనే మా అభ్యాగతి (చెప్ప మరచాను. విజయనగరములోని కాలేజి విద్యార్థి అక్కడ ఉంటున్నాడు. అతడు మా కాతిధ్యమిస్తానని ఉత్తరం మూలముగా తెలియజేశాడు) ఎదురుపడి, "అయ్యో, బస్సు టైముకి కొంచెము లేటుఅయింది. అని నొచ్చుకుంటూ మా సామాను లక్కడే ఉంచమని మమ్ములను మర్యాద చేస్తూ వాళ్ల యింటికి తీసుకు వెళ్ళాడు.

### తొలి చూపు

ఆ ఊరిలోకి అదే పెద్ద యిల్లు. అదొక సమిష్టి కుటుంబము. ఇంటి యజమానులు సంతోషంతో మాకు స్వాగతమిచ్చారు. ఈ లోపల మా చుట్టూ పెద్ద గుంపు మూగింది. "వీరంతా మీ శిష్యులని" మందహాసముతో అన్నాడు గృహయజమాని. ముక్కు మీద వ్రేలేసుకుని చూచాను అల్లాంటి గుంపునే. తరతరాలనుండి దాస్య భారంతో క్రుంగిపోయిన వెన్నుముకా, పాలిపోయి గుంటలుపడ్డ కళ్లూ విచారభారముతో నెరిసి నెరవని జుట్టూ, అది చిందరవందరగ పడిన ముఖమూ, దాని మీద క్రొత్త ముఖాలుచూచిన ఆశ్చర్య రేఖలూ. అవీ మా ప్రథమావలోకనము గురు శిష్యులకు.

భోజనమయాక అక్కడ సంగతులన్నీ కనుక్కున్నాను చావడిలో కూర్చున్నాము మేము. ఆయింటివారూ, ఆఊరి కరణమూ (అతడూ ఉత్సాహవంతుడైన కుఱ్ఱవాడే.) ఇంకా ఆ చుట్టుప్రక్కల కొంచెము మోతుబరులైన రైతులు.

### రైతుల స్థితి

ఆ ఊరి జమీందారుకి కాంగ్రెసంటే వరమ విరోధమట. నూటికి 99 మంది శిస్తుల భారాన, వ్యాజ్యాలమూలాన్న క్రుంగిపోతున్నారట. ఒక రైతును కాంగ్రెసు చేసిన ఋణవిమోచన చట్టము గురించి పలుకరిస్తే, అదివాళ్ళకు కొంచెముగూడ సహాయము చేయలేదని విచారముతో జవాబుచెప్పాడు. వడ్డీరేటు యథాప్రకారముగా 24% కాంపౌండుగానే ఉన్నదట. ప్రారంభమున అనుమానంగున్నప్పుడే కొంత సొమ్మును కాలపరిమితి ననుసరించి వడ్డీ అసలు ఫాయిదాలలో మినహాయించి ప్రామిసరీనోటు అమాయకపు రైతు చేత వ్రాయించి పుచ్చుకోవచ్చుగలదట. సంభాషణ బాగా సాగుతూండేసరికి అక్కడొక వృద్ధరైతుకు ధైర్యము కలిగి తనకష్టాలన్నీ యేకరువుపెట్టాడు. పండినా యెండినా శిస్తు తప్పదట. జమీందారు శిస్తుకంటె అమరకవారు శిస్తు 4 రెట్లు అధికంగా ఉంటుందట. పగలు రాత్రియనక, ఎండవానలకోర్చి పండించుకొన్న నిరుపంట, శిస్తు బకాయిపైన కట్టిన చక్రవడ్డీ నిమిత్తమై కళ్ళముమీదనే ఊడ్చేసినారట జమీందారి యుద్యోగులు. అసలు శిస్తుయిన తీరదేవని కన్నీళ్ళు గ్రుక్కుకున్నాడా అమాయకుడు. చెరువుల మరమ్మతు 4, 5 సంవత్సరాలదైన లేదట, 70% భూమి వర్షాధారపు పంటట.

సంధ్యపడుతూంది. ఊళ్లోకి వెళ్ళి వస్తామని సంభాషణ ఆపి లేచాము. కరణాన్ని మాకు స్టాటిస్టిక్సు (లెక్కలు) యివ్వడములో సహాయము చేయవలసినదని కోరాము. మా ఫెడరేషనువారు తయారుజేసిన ప్రశ్నలు వాళ్ళకి చదివి వినిపించాము. అక్కడవాళ్ళంతా సహాయము చేస్తామన్నారు యీ విషయంలో.

### ఓనమః శివాయ

రాత్రి పెందలకడే భోజనముచేసి రామమందిరం దగ్గర సభచేసాము. మేము కష్టకగీతాలు పాడుతూంటే చాలామంది మూగారు. మాలో ఒకడు అరుగెక్కి ఉపన్యాసము ప్రారంభించాడు. దాని సారాంశము—ఆరోజు రాత్రినుంచి 7 గంటలకు బడిపెట్టామని, అది 15 ఏండ్లు దాటిన వయోజనులకు వృద్ధులకేనని, గ్రామఫోను, మ్యాజిక్ లాంటరన్ మొదలగునవి చూపుతామని, పాటలు, పురాణాలు మొదలగునని, ఇవి గాక ఎన్నో ఉపన్యాసాలు, ఏవేవో విషయాలమీద మాట్లాడతామనిన్నీ, అనువారల్లో అక్షరమురాని వాళ్ళచేత పుస్తకము చదివిస్తామనిన్నీ మాప్రణాలిక (syllabus) లోని విషయాలన్నీ యేకరువుపెట్టాము ప్రజలు చాలా సంతోషించి, వెంటనే నూరుమంది పేర్లిస్తామని ముందుకువచ్చారు. మేము తక్కువమంది అవుటచేత 50 మందిపేర్లే తీసుకున్నాము. తరువాత మాలో యింకొక కామ్రేడ్ లేచి, విషమించుచున్న దేశపరిస్థితుల మీద, విద్యార్థులు వయోజన విద్యాప్రచారము నకు పూనుకొనుటకు గల్గిన అవశ్యకతమీద, యుద్ధము మొదలైన సంగతుల మీద గంభీరముగా లెక్చరిచ్చాడు. శిష్యులుకూడా ఆవలించకుండా విన్నారు—అంతే అర్థమయిందను కుంటాను. ఆతర్వాత చీట్లపేకతీసాము — మరేమీ కాదు అక్షరాల చీట్లపేకే. ఆ అక్షరాలు ఒకొక్కటీ బ్లాకుబోర్డుమీద వ్రాస్తూ వాళ్ళను పలికించాము వాళ్ళకంతా అది క్రొత్తగావుంది. ఎప్పుడో చిన్నప్పుడు వాళ్ళనాయన బడిత జాతెరవేని బడిలోకి లాక్కువెళ్లితే విన్న ముక్కలు: నేటికి మళ్ళీ వింటున్నందుకు వాళ్ళకి చాలా సంతోషమయింది. వారికళ్లు కాంతితో మెరుస్తున్నవి: మధ్యమధ్య పరాచకాలు ఆడుకుంటున్నారు ఒకరొకర్ని. కాని మేము నోరు కదిపేసరికి ఎవరికివారుకు వాయ గప్‌చిప్‌గా ఊరుకుంటారు. మా వృద్ధశిష్యుల పట్టుదల, విద్య నేర్చుకోవాలనే యాతురత చూచి మాలో మేము ముగ్ధులమైపోయాము. రాత్రి 12 గంటలయింది: కాని వాళ్ళకావలింతలు రానేలేదు. చివరికి వాళ్లే బడి చాలించమన్నారు మామీద జాలివేసికాబోలును.

### ఋచీ — శుద్ధీ

అనుకున్నాను ఆరింటికే లేచాము వుల్లగొళ్లో, చెంబుచేత్తో పట్టుకొని కాలువగట్టుకి వెళ్ళాము. ప్రశాంతమైన ప్రకృతి పచ్చని బయలు. నీలాలనంటి చెరువులోని నీళ్ళు.నన్ను క్షణమాత్రము ప్రకృతి సౌందర్యములో తన్మ యుడినిగావించింది. కళ్ళు తెరిచేసరికి, బిందెవొడ్డున పెట్టి స్నానము చేస్తున్న ఒక మునిలావిడ కనబడింది. అది మడిగాబోలు: త్రాగేనీళ్ళు మురికి చేయడం: మూఢమతం!! అటుప్రక్క ఒక గేదె నీళ్ళలో పేడవేసింది. ఇక చూడలేక కళ్లు మూసుకున్నాను. తరువాత చెరువుదగ్గరకు వెళ్ళేసరికి, మెట్లమీద పదిమంది పుల్లనోట్లోనములుతూ ఖాండ్రించి ఉమ్ము వేస్తున్నారు నీళ్ళలోకి. ఇక నాపుకోలేక వెంటనే అక్కడ ఒక చిన్ని ఉపన్యాస మిచ్చాను. పదిమందీ చుట్టూమూగి వింతగావింటున్నారు. నీటివలన వచ్చేజబ్బులను గురించి చెప్పుతూంటే ఆఖరుకి "గ్లాసులో యింత పేడనీళ్లు జల్లితే త్రాగుతారా" అని ప్రశ్నించేసరికి ఎవరూ మాట్లాడలేదు. మడికట్టుకుంటున్న మునిలావిడ కోపం చూడాలి! తక్షణమే పదిమంది యువకులు—మంచి బలిష్ఠులు—వాలంటీర్లుగాచేరి చెరువులో ఈగనైనా వ్రాలనీయమన్నారు. (నిజానికి అంతపని చేసేవారు గూడాను.) ఒక్కదెబ్బతో మడిగిడి యెరగగొట్టాను గదాఅని అతిసంతోషంతో యింటిముఖం పట్టాను నే చేసిన ఘనకార్యం తక్కిన కామ్రేడ్స్‌కి చెప్పాలని. పాపము నిజానికి పల్లెటూరివాళ్లగూడా వింటారు నచ్చేటట్లు చెప్పితే.

ఇంటికి వెళ్ళాక నామాట వింటేగా తక్కిన వాళ్ళు. వాళ్ళేవో ఘన కార్యాలు చేశారట. ఒకడు హరిజన గూడెములోనికి వెళ్ళాడట. అక్కడ మలమూత్రాలు అసహ్యముగా ఎక్కడపడితే అక్కడ వుంటే, శుచి, శుభ్రతను గురించి, సంఘములో వారెందుకు నీచులుగా అంటరాని వారిగా చూడబడుతున్నారో ఇంకా నిమ్నజాత్యుద్ధరణమీద అనేక విషయాలు ముచ్చటించాడట. ఇంతలోకే ఇంకొక కామ్రేడ్ క్రొత్తరకము చీపురు ఒకటి భుజము మీద గడలాగు ఆడిస్తూ వచ్చాడు. అతడు సహకార పద్ధతిని గ్రామసౌందర్యాన్ని, ప్రజల ఆరోగ్యాని యెంతవృద్ధి పరచవచ్చునో తెలియజేసాడట: చివరికి ఎవళ్ళెక్కువ పనిచేశారని తగాదా వచ్చింది. రెండు నెలలాఖరకి చిట్టాలు చూద్దామని ధీమాగా అనుకున్నాము. హరిజన గూడెములో ట్రెంచిలెట్రిన్సు త్రవ్వుదామని, వ్యాయామసంఘాలు స్థాపిద్దామని, లైబ్రరీలు పెట్టాలనీ, ఎన్నో గొంతెమ్మకోర్కెలు పుట్టాయి. గణపతిపూజ చేశాము ఆరోజున.

ఉదయాన్నే యిన్ని టీ నీళ్లు త్రాగడము అలవాటేమో మరి పది గంటలకే కడుపు నకనకలాడింది. భోజనము త్వరత్వరగా ముగించి కాస్త నిద్రపోదామనుకునేసరికి పది పదిహేనుమంది వచ్చారు మమ్ముచూడ్డానికి. అందులో కొందరు రాత్రి లెక్చరుకి రాలేదని నొచ్చుకున్నారు. నేను తమాషాగా "వెనుక వచ్చిన కొమ్ములే వాడి" అనే సరికి వక్కుమని నవ్వారు అందరూ. మిగిలిన కొంతమందికి రెండు గంటలు అక్షరాలు నేర్పాము. నిద్ర లేచే సరికి టీ నీళ్లు లేవు. వార్తా పత్రిక లేదు. కొంచెము కష్టమనిపించింది.

ఇలా ప్రతిరోజు సంగతి వ్రాస్తే చేటభారతమౌతుంది. అందుకని ముఖ్యమైన సంగతులు మనవి చేస్తాను.

### పట్టుకుపోతామట!

"కష్టే ఫలే" అన్నారు పెద్దలు. కనుక వచ్చిన కష్టాలు. మమ్మెదుర్కొనిన అడ్డంకులు, చెప్పుతాను. జమీందారు, వాళ్ల బంట్రోతులు మమ్ము "కాంగ్రెసు జనమ"ని పుకారు వేసి కక్షగట్టారు. చొక్క చీరేద్దామనుకున్నాను వాళ్లనీ, వాళ్ల జమీందారునీ. ముసలమ్మలు "మడిలేని నాస్తికు"లన్నారు. ఫరవాలేదు అనుకున్నాము. సనాతనులు "బాపనోళ్ళు, కూడులేక తెలగాలిండ్లో తిండి తినడానికి వచ్చా"రన్నారు. ఆ రాత్రే వర్ణాశ్రమ ధర్మాలు అవియెందుకు తెచ్చి పెట్టబడినవీ, విపులముగా చర్చించాము. అక్కడ ట్యూషను చెప్పుకొనే ప్రైవేటు మాష్టర్లు మామీద కత్తి గట్టారు. మేము "మీ యిష్టమున్నవాళ్లు వాళ్ల దగ్గరకే వెళ్లవచ్చు"నని చెప్పాము. కానిఅంతటితో వారి కోపము చల్లారలా. మేమంతా యిక్కడివాళ్లని మంచిమాటలు చెప్పి తీసుకువెళ్లి ఎక్కడో అమ్ముతామని వదంతిపుట్టించారు. కాని "అంత వచ్చి అబద్ధము ఎలా నమ్ముతారా" అనుకున్నాము. అయినప్పటికీ కొంతమంది మా శిష్యులు యీ దుష్ప్రచారమువలన మానేశారు. అప్పుడు ఆ టీచర్లని ఎక్కడదొరికితే అక్కడ చీవాట్లుపెట్టాము. అంత కొన్నాళ్లయ్యేసరికి వాళ్లేమీ చెయ్యలేకపోయారు. చిట్టచివర రోజుల్లో మేమున్న యింటిలో పెద్ద తగాదా అయింది: చివరకు గొడ్డళ్లు పుచ్చుకున్నారు.



సామెత ప్రకారంగా, ఈ అజ్ఞానికి, అసభ్యతకు, అనాగరికతకూ, అహంకారానికి మాకు చాలా కోపంవచ్చింది. సిగ్గయింది. అసహ్యమనిపించింది. ఆనాడు నిరశనవ్రతము పూని, అక్కడి రామ మందిరంలో కూర్చుని ఈ సంగతులమీద లెక్చరిచ్చాము. ఆస్తి సంపకము, ప్రభుత్వమూ, దీని పుట్టుపూర్వోత్తరాలు, అన్నీ చెప్పుతుంటే చాలా సావధానముగా విన్నారు. చివరకు కాంతాకనకాలకన్న సామెత ఒక ముసలి అతడు చెప్పాడు మాకు, సామ్యవాదం వస్తే యీ చిక్కులన్నీ పోతాయన్నాము. వుత్సాహంగా అప్పుడు కాబోలు అని అనుకున్నారు. రాత్రి మా దీక్షఫలితంగా ఆ వూళ్లో వాళ్లంతా మందిరానికి వచ్చి మమ్మల్ని బ్రతిమాలారు. మా అభ్యాగతులుకూడా చాలా విచారించారు. కోపముతో వద్ద తొందరను నిందించుకొన్నారు. సిగ్గుతో మళ్లీ మమ్మల్ని వారి యింటికి ఆతిథ్యానికి రమ్మన్నారు. అప్పుడా అర్ధరాత్రిని పిండివంటలతో భోజనము చేశాము నవ్వుతూ. అంతటితో కష్టాల అధ్యాయము సమాప్తమయింది.

అపైన అన్నీ మేముచేసిన ఘనకార్యాలే, అరవైమంది విద్యార్థులకు పదిమంది బాగా చదువగలిగారు; తక్కినవారు కూడాతప్పు టడుగుల స్లేటులో బొల్తాలు కొట్టుతున్నారు. ఉపన్యాసాలు చాలా విషయాలమీద యివ్వబడినవి. హిస్టరీ సోషియాలజీ జాగ్రఫీలలో చెరి 12 లెక్చర్లివ్వబడ్డవి. రామాయణముతో ప్రారంభించి,హిందూ రాజులు, మహమ్మదీయులు, బ్రిటిషు వర్తకుల కంపెనీ, మనదేశ వీరులు మీదనూ, చివరకు బ్రిటిషు సామ్రాజ్యము మీద పురాణ రూపముగా చెప్పినాము. కాంగ్రెసుయొక్క ఆశయాలు, దాని చరిత్ర, ప్రస్తుతమే అవస్థల్లో నున్నది, జాతీయ వాంఛా తీర్మానము మొదలగు త్రిపురి తీర్మానములను గురించి చెప్పినాము. ఇది హిస్టరీ గురించి రామాయణ కాలమునుండి, వివిధ శతాబ్దాలలో, వివిధ పరిపాలనలలో ఆచారాలు, సాంప్రదాయాలు, గురించి చెప్పుతూ,స్వర్ణయుగములో ప్రజల నింతకంటే పీల్చుకు తినే బానిస విధానం అమలులోనున్నదని ప్రస్తుతమింకను కొన్ని రాజపుత్ర దేశములలో జరుగుచున్న అత్యాచారాలు, కష్టాలు, వీటికన్నిటికి మూలకారణము ధనికవాదమని తెలుపుతూ, సోషలిజం వస్తే ఎలా యీకష్టాలన్నిటికీ సర్వరోగ నివారిణిగా పనిచేస్తుందో, రష్యాదేశములో శాంతి భద్రతలున్నదని, వారి మర్యాదలు, ఆచారాలు గురించి అన్నీ తెలుపబడినవి. ఇది సోషియాలజీ గురించి దేశకాల పరిస్థితుల గురించి ప్రపంచ స్వరూపాన్ని పటంద్వారా చూపి, సముద్రాలు, వర్షాలు, ఎగుమతి దిగుమతి, వ్యవసాయము (ట్రాక్టరులపై పండిస్తే యిప్పటికన్నా ఎంత ఎక్కువ పండుతుందో) కథల రూపకముగా చెప్పగలిగాము. ఇవిగాక సాంఘిక సంస్కరణలు గురించి, గ్రామ పునర్నిర్మాణ సమస్యలగురించి, ఎన్నో వీధులలో ఉపన్యాసాలు జరిగినవి,అన్నీ వింతగా విన్నారు. ఎంతమటుకు అర్థము చేసుకున్నారో నిర్ణయించడము కష్టము.

ఆచరణరూపముగా కొన్ని చేయగలిగాము: చెరువు కావలాకాయుట, వీధులు శుభ్రముగా నూడ్చుట, పెంటదిబ్బలు లేకుండా చెత్తగుంటలు త్రవ్వి అందులోవేయుట మొదలగునవి: ట్రెంచి లెట్రిన్సు త్రవ్వుదామనుకున్నాము: ఆఊళ్ళో పెద్దల ధనసహాయ్యముతో ఒకచిన్న గ్రంథాలయము స్థాపించగలిగినాము. ప్రథమ చికిత్సా (1st aid) సహాయముతో 30, 40 రోగుల కారోగ్యము చేకూర్చినాము. ఆరోగ్యవిషయికముగా మ్యాజిక్ లాంతరు ప్రదర్శనములు చూపినాము, కలరా మొదలగు వ్యాధుల గురించి వాటి నివారణ గురించి తెలియజేశాము. వాళ్ళకష్టాలన్నీ తెలుసుకుని, ఆదాయ వ్యయములు, అప్పుల బాధలు, వ్యవసాయము, పంట, మరణజన్మ పట్టీ, మొదలగు వాటిమీద లెక్కలు (స్టాటిస్టిక్సు) తీసుకొన్నాము. మేమున్నకాలములో ఒక తాలూకా రివిన్యూ యిన్‌స్పెక్టరు అక్కడకువచ్చి సేల్సుటాక్సు బిల్లుమీద కాంగ్రెసు ప్రభుత్వమునకు వ్యతిరేక ప్రచారముచేశాడు. ప్రజలలో అసంతుష్టి కలిగింది. ఆనాడు రాత్రి మేము పెద్ద సభచేసి, యీచట్టము వచ్చుటకు కారణాలు తెలియజేసి, ఇల్లాంటి ఉద్యోగులు, జాతీయాభ్యుదయానికి వేరుపురుగులువంటివారని, తీవ్రముగా ఉద్యోగులయొక్కయు, పోలీసాఫీసర్లయొక్క చర్యను ఖండించినాము. గ్రామఫోను వారవారముపెట్టి ఉపన్యాసము లిచ్చేవారము; వీటికి వేయిమందిదాకా సభకు హాజరయ్యేవారు. అన్నిటికన్న గొప్ప విషయము ఆఊళ్లో ఉపాధ్యాయుల సహాయములో స్థానిక వయోజన విద్యాసంఘమును నొకటి స్థాపించి, వారవారము ఉపన్యాసములు, అక్షరాభ్యాసము, పుస్తకాలు చదువుట మొదలగునవి రెండు గంటలు చెప్పునట్లును, ఈవిధముగా ఒక సంవత్సరము జరుపునట్లు ఏర్పాటుచేశాము. ఇది గొప్ప సంగతియే; ఒకపెద్ద మెట్టెక్కినామన్నమాట, ఇంకా చుట్టుప్రక్కల గ్రామాలకి వెళ్లి అక్కడ వుపన్యాసాలిచ్చినాము. ధన సహాయ్యముండి ఎక్కువ మంది కామ్రేడ్సు గనుక వచ్చినట్లయితే ఇంకా యెక్కువ చేయగలిగేవారము.

### భవిష్యత్తు?

అవిచేశాము, ఇవిచేశాము, ఏవేవో చేయబోయాము. అయితే.... భవిష్యత్తుఅంతా ఒక పెద్ద ప్రశ్న? ఆంధ్రరాష్ట్ర విద్యార్థి సంఘము చేసిన కృషి అవిద్యాసముద్రంలో ఒక నీటి బొట్టువంటిది. ప్రభుత్వము నిమ్మకు నీరుపోసినట్లూరకుంది. ఎన్ని సంవత్సరాలు, ఎన్ని శతాబ్దాలు కావాలో యీ ఉడుతా ప్రయత్నములు సేతువు కట్టడానికి. అసలు ఇంతవరకు మేము చేసిన ప్రయత్న మెంతవరకు ఫలించింది? మన ఉపన్యాసాలన్నీ వురాణంలాగు రెండో చెవిలోంచి దూరిపోయినవా? ఈప్రజలు మన ఉత్సాహాన్ని, మన శక్తిని యెంతవరకు పంచుకోగల్గారు. ఎంతమటుకు ఉపయోగించుతారు? రెండునెలలు అజ్ఞాతవాసము చేసినట్టి యీ ప్రయత్న మెంతవరకు జయప్రదము?

ఇన్ని ప్రశ్నలు నామనస్సులో సముద్రంలో కెరటాల్లాగు దొర్లుతున్నాయి. మదనపెట్టుతున్నవి. తల బ్రద్దలయి పోతుందను కున్నాను ఫ్రంటుసీటులో కూర్చున్నాను. బస్సు రివ్వున పోతూంది గోధూళికా సమయంలో. కాని.... మేము రెండు నిమిషాలక్రింద ఆ గ్రామము వదలి వెళ్తూంటే మావెంట—ఆవుపెంట వచ్చు దూడల్లాగ—వచ్చిన ఆవృద్ధ శిష్యులు: ఆ అమాయిక హృదయాలు: ఆ కళ్ళల్లో ప్రతిబింబించే జ్యోతులు, ఇప్పుడిపిదే వాళ్ళకష్టాలకు. వాళ్ళ ఆకలి మంటలకు, దేవుడుకాదు, కర్మకాదు కారణమంటూ, నిజమైన కారణము ఎందులో వున్నది ఎక్కడవున్నదనే. ఆందోళనలో అల్లలనాడుతున్న ఆ మనోభావాలు అవన్నీ ఇంకాఎన్నో, నామనస్సును యిప్పుడేల వలె గ్రుచ్చుకొన్నవి. నాహృదయ ఫలకము మీద వారి అమాయిక అభాగ్య ఫొటోగ్రాఫువలె పడింది. వారికికూడా యీ కామ్రేడ్సు ఊరికే రాలేదు. 'వీరు మన కష్టాల్ని మన దుఃఖాన్ని పంచుకుని మన బరువు తగ్గించడానికే వచ్చినారని' అనుకుంటున్నట్లున్నది. అదుగో ఆ కళ్లెంబడిని జారే ఆశన్నీటి బిందువులే ప్రమాణం.

---

## నవశక్తికి

## చందాదారులు గండి! విరాళాలు ఇవ్వండి!

నవశక్తి గత ఒకటిన్నర సంవత్సరమునుండి ప్రజలయొక్క ఆదరణవల్ల, పార్టీ సభ్యులయొక్క ప్రత్యేక కృషివల్ల అభివృద్ధిచెందుతూ వచ్చింది. జమాఖర్చుల ఈక్రింద ప్రకటించుచున్నాము.

జమలు

| | 1937 డిసెంబరు—1938 మే ఆఖరకు. | 1938 జూన్—1938 నవంబరు ఆఖరకు. | 1938 డిసెంబరు—1939 మే ఆఖరకు. |
|---|---|---|---|
| చందాలు | 835— 7—0 | 2006— 3—9 | 1485—11—0 |
| ఏజెంట్లు | 608— 3—3 | 697—14—0 | 946— 8—9 |
| అడ్వర్టైజుమెంట్లు | 232— 6—9 | 326— 0—3 | 581— 9—6 |
| జాబ్‌వర్కు | ——— | 18— 0—6 | 230— 9—3 |
| విరాళములు | 1946—13—6 | 1403— 9—3 | 1314— 4—0 |
| మొత్తము | 3622—14—0 | 4451—11—3 | 4558—10—6 |

ఖర్చులు

| | 1937 డిసెంబరు—1938 మే ఆఖరకు. | 1938 జూన్—1938 నవంబరు ఆఖరకు. | 1938 డిసెంబరు—1939 మే ఆఖరకు. |
|---|---|---|---|
| ఎస్టాబ్లిషుమెంటు | 190—12—0 | 350—15—3 | 91— 9—6 |
| ఆఫీసు అద్దె | 60— 0—0 | 73— 0—0 | 66— 0—0 |
| బ్లాకులు | 225 — 0—0 | 327— 0—0 | 253— 6—0 |
| కాగితం | 614— 7—0 | 1002— 4—0 | 1010—10—0 |
| పార్సెల్సు | 120— 1—0 | 123—13—9 | 143— 4—0 |
| పోస్టేజీ | 297— 5—6 | 511— 3—3 | 640— 4—9 |
| ప్రింటింగు | 1279—14—0 | (వర్కర్ల జీతాలతోసహా) 1373—14—9 | 1477— 8—6 |
| సంపాదకీయవర్గం | 773 — 5—3 | 728—14—3 | 842— 3—3 |
| | 3560—12—9 | 4487—1—3 | 4524—14—0 |

మొదటి ఆరునెలలలో రూ 120 లు ప్రయాణ ఖర్చు లగుటచేతను, రెండవ ఆరు నెలలలో విదేశ పత్రికలకు రూ 150 లు చందాలు కట్టుటవలన బెజవాడలో సొంత ఆఫీసు ఏర్పరచడమువల్ల ఎస్టాబ్లిషుమెంటు ఖర్చులు, మూడవ ఆరు నెలలకన్న ఎక్కువగా అయ్యాయి. కాగితం ఖర్చు, ప్రింటింగు ఖర్చులు, రెండవ ఆరు నెలల కాలముకోసు మూడవ ఆరు నెలల కాలములోను ఎక్కువగుటకు కారణము. పత్రికను 16 పుటల నుండి 24 పుటల పత్రికగా మార్చుట, జాబు వర్కు చేయుట.

పై లెక్కలబట్టి నవశక్తి పోషణకు చందాదారులు, ఏజంట్లు, అడ్వర్‌టైజుమెంటులద్వారా ధనము తక్కువగా వచ్చినచో విరాళములమీద ఎక్కువగా ఆధారపడవలసివస్తుందని తేలుతూ ఉంది. విరాళములుకూడా క్రమేణా తగ్గుతూ ఉన్నట్లు కూడ పాఠకులు గమనించి ఉండవచ్చు. అందుచే పార్టీసభ్యులు మరింత కృషిచేసి పత్రికకు ఎక్కువగా అమ్ముటకు, చందాదారుల చేర్చుటకు, అడ్వర్‌టైజ్‌మెంట్లు సంపాదించుటకు విరాళములు ప్రోగుచేయుటకు తోడ్పడెదరని ప్రార్థించుచున్నాము.

ప్రజలు యథాశక్తి విరాళములిచ్చి, చందాదారులుగ చేరి తోడ్పాటుచేయ ప్రార్థించుచున్నాము.

—సంపాదకీయ వర్గము.

---

### మునగాల సత్యాగ్రహ నిధి.

పెద్దాపురం గ్రామ రైతుసంఘంవారు మునగాల సత్యాగ్రహనిధికిగాను వసూలుచేసి శ్రీ కాకినేని రామకృష్ణయ్యగారి ద్వారా పంపిన రూ 8-8-0 కృతజ్ఞతతో అందుకొంటిమి.

వె. విశ్వేశ్వరరావు,
అసిస్టెంటు సెక్రటరీ,
ఆం॥ రా॥ రైతుసంఘం.

# అది హత్యయా? ఆత్మహత్యయా?

## మహాకవి - విప్లవవీరుడు - ఎర్నెస్ట్ టాలెర్ ఘోర మరణం

ఎర్నెస్ట్ టాలెర్ ముత్తాత బంగారు కంచాలలో భుజించాడు. అతని గుర్రం వెండి తొట్టిలో నీళ్లు త్రాగేది, దానా తినేది. టాలెర్ తాత పని కొంచెం తగ్గటంవల్ల, వెండి కంచాలలో భుజించేవాడు. అతని గుర్రం రాగి తొట్టిలో దానా తినేది, నీళ్లు త్రాగేది. కాని టాలెర్ వంతు వచ్చేసరికి, గుర్రమూలేదు, దానాకు తొట్టి అవసరమూలేదు. టాలెర్ సంగతి చూద్దామా అంటే, అంచులు విరిగిపోయి, అలంకారాలు, నగిషీలు లేని తెల్లని పింగాణీ బొచ్చెల్లో భుజించాడు.

### బాల్యం

టాలెర్ తండ్రి యూనివర్సిటీలో బాగా చదువు సంధ్యలు సాగించాడు. వారసత్వంలో ఒక దుకాణం వచ్చింది. "ఇంత దుమ్ము కొట్టుకొన్న పాత కాతా పుస్తకాలున్న మరొక గది" కూడా వచ్చింది. దానిలో అతని తండ్రి "ఒక్కొకపుడు పగలల్లా, ఇంకొకప్పుడు, రాత్రింబగళ్లూ చదువుతుండేవాడు" టాలెర్ తల్లి ఇంటి పనులు కష్టపడి బాగా నిర్వర్తించే గృహిణి. మంచి హృదయం ఆమెది. దుకాణంలో, ధాన్యపు కొట్టులో, ఇంటిలో కష్టపడి పనులు నిర్వర్తిస్తుండేది. బీదలకు తిండి పెట్టేది. ఒక్కొకపుడు "అడుక్కు తినే వాళ్ళని మధ్యాహ్నం భోజనానికి ఆహ్వానించేది." పుస్తకాలు చదవడంలో ఆమెకి ఆసక్తి యెక్కువ. ప్రతి సాయంత్రమూ పుస్తకాలు చదవ ప్రారంభించేది. "ప్రొద్దు పోయేవరకు" చదివేది. ఒకో సారి పుస్తకాలు చదువుతూ చదువుతూ నిద్ర బోయేది. ఎప్పుడయినా, చిన్ని కుమారుడు మేల్కొల్పితే, ఆమె ఇలా అంటూ ఉండేది:

"నన్ను చదువుకోనీయి, బిడ్డా! చదవడం ఒక్కటే నాకు సంతోషమిచ్చే విషయం."

"అమ్మా, నీ వెపుడూ ఎందుకు కష్టపడతావు?"

"మరి నీకు తిండి ఎలా నాయనా?"

కాబట్టి, టాలెర్ పుస్తకాలు చదివే అలవాటుకు ఆశ్చర్యపడ నక్కరలేదు. అతని దేహాన్ని నిర్మించిన రక్తంలోనూ, బొమికెలలోనే ఉంది అది. అతని బుద్ధి, తల్లిదండ్రుల, తాతల బుద్ధి వంటిదే. అందుకనే ఎపుడూ చదవడం, జ్ఞానాన్ని ఆర్జించడం అనే ఆహారముతో అతని బుద్ధిని పోషించవలసి వచ్చింది.

కుర్రవాడుగా ఉన్నప్పుడే గొప్పవాడు కావాలని కోర్కె ఉండేది: "జూలీ! నేను కథ రాయబోతున్నాను. దానిని బెర్లిన్‌లో నాటకం వేస్తారు. నీవు రాయల్ బాక్సులో కూర్చుండువుగాని" అని అన్నాడు.

జూలీ వంట మనిషి. "అర్థం చేసికోగల మనిషి ఆమె ఒక్కతే". విచార భారంతోను. శూన్యంతోను నిండిన అతని మొదటి పద్యాన్ని ఆమె వింటుంది. అతనితో అతనిలాగా భాగ్యవంతులు కాని పిల్లల దారిద్ర్యాన్ని దుఃఖాన్ని చెపుతూ వుండేది. ఆమె కంఠం ఆ వేళలో గద్గదమయేది. జూలీ ఏడుస్తూ, కళ్ళు తుడుచుకుంటూ, అనేది "నీకు 'ఆమ్లెట్' కావాలా 'బావ్' కావాలా?" పద్యం తర్వాత పద్యం వ్రాసేవాడు:

లేవవలెనోయ్! మేలుకొనవోయ్! మేలుకోవోయ్!
క్రూర ప్రభునీ క్రోధ దృష్టికి
వంగి లొంగీ వణికి చచ్చే,
బంధనాల్లో నలిగిపొయ్యే,
విరికి పండా!
స్వేచ్ఛ అంటే—నీకేమి—తెలుసోయ్!
వైరితోటి పెనుగులాడే
ధైర్యమింతా తెచ్చుకొనవోయ్!
చీల్చి చెండాడి శత్రుని
కాలిక్రిందా నలిపి వెయ్యోయ్!
కోలుపోయిన స్వేచ్ఛ సిప్పుడు
గుంజుకొనవోయ్! కీర్తిగనవోయ్!
లేవవలెనోయ్! మేలుకొనవోయ్! మేలుకోవోయ్!

టాలెర్ చిన్నతనంలోనే జర్నలిస్టుగా మారాడు. వెంటనే పత్రికలకు వ్రాసే అవసరం కల్గింది. అంతరంగిక రాజకీయావసరం వలన కాదు. రాజకీయావసరము ఎపుడూ ఆగదు. తొందర పెడుతుంది. కాని ఇతనిది మానవ స్వభావంతో కూడింది, చిన్నపిల్లవాడి లాంటిది. టాలెర్, జీవితములో ఎల్లపుడూ చిన్న కుర్రాడే. మంచి విశాలహృదయంగల కుర్రాడు. నమ్మడానికి వీలులేనంత ప్రేమించ దగ్గ కుర్రాడు. కలుసుకొన్న ప్రతివాణ్ణీ నమ్మేవాడు. చిన్నపిల్లలు తమ విశాల నయనాలు విప్పారి ఆశ్చర్యంతో చూస్తున్నట్లు వస్తు సౌందర్యాన్ని విలోకించేవాడు. తరచుగా, ఐస్‌క్రీమ్ మీదో, రొట్టె మీదో, ఒక కప్పు మంచి టీ మీదో, ఏదో మంచి రిమార్కు చేస్తుండేవాడు.

"నాకు వారానికి 50 పెన్నింగులు డబ్బు వచ్చేది. కాని ఏపిల్ పండ్లకే 20 పెన్నింగులు ఖర్చయేవి. రోజూ కావాలి నాకవి. అందుకని నా పట్టణమునుండి బ్రాంబెర్గులోని ఒక పత్రికకు వార్తలు పంపేవాణ్ణి. ఒక పంక్తికి రెండు పెన్నింగు లిచ్చేవారు.... వ్రాయిడము నాకు సరదా: నేను మాటల్ని మెరుగుపెట్టేవాణ్ణి; నాకు నచ్చని వాక్యాలను దిద్దటానికి గంటలకొలది కాలాన్ని ఖర్చుపెట్టేవాణ్ణి...." అని వ్రాసుకొన్నాడు టాలెర్.

పైకి కారణం పండ్లయినా, అసలు కారణం వేరు. భావాల్ని, ఆలోచనల్ని, ఆవేశాల్ని, మండిపోతున్న మానసిక పరివర్తనాన్ని, మాటలగుండా వెలిబుచ్చాలనే సహజ ఆకాంక్షయే, ఇతన్ని ఈ వృత్తికి లాగింది. అతనికి 20 ఏండ్లు నిండాయో లేదో, అప్పటికే నాటకాలు, పద్యాలు—రాజకీయ సాంఘిక ప్రాముఖ్యతగలవి—వ్రాశాడు.

అతని ప్రకృతిలోని ఈ విప్లవ స్వభావముతోబాటు అతను అప్పుడప్పుడూ చావును కోరుకోడం, ఆత్మహత్య చేసుకోవాలని తలంచడం విచిత్రముగానే ఉంటుంది. డెన్మార్కులో హామ్లెట్ సమాధి ప్రక్కన నిల్చొని "ఒకప్రక్క కార్యాచరణకై కోరికా, మరొక ప్రక్క మృత్యువును వాంఛించడమూ, ఈరెంటిమధ్య" ఊగులాడుతుండేవాడు. సందిగ్ధావస్థలో తన్నుకునే వాడు....... "కాలంతోపాటు మార్పు చెందుతూ ఒంటరిగా" రైతు [illegible] గడపాలని ఒకసారి కోర్కె ........హఠాత్తుగా మనస్సు మార్చుకొని విద్యార్థి జీవితాన్ని గడపటానికి నిశ్చయం.......... ఈ సందిగ్ధావస్థ—నేటి మన కవులలోని ఈ సందిగ్ధత—నేడు ప్రపంచపు అల్లకల్లోలానికి ప్రతిబింబమే. ఆర్టిస్టు అతడు నివసించిన కాలానికి ప్రతిబింబమే. రాజకీయపు ఏరులోని ఎదురువాగులవద్ద నిండిన ఈప్రపంచములో తప్పునిసరియైన, మార్పులోని ఉత్సాహము, ఉద్వేగ శక్తులు,పరస్పర విరుద్ధఆశయాలు అతనిలో ఉన్నాయి. కనీసం గత 50 ఏండ్లనుండి మరొక నూతన జీవిత విధానాన్ని, క్రొత్త ఆశయాన్ని, నూతన ఆర్థిక పునాదిని, బానిసత్వములో ఉండి దాన్ని బ్రద్దలుగొట్టటము ఎరుగజాలని లక్షలకొలది ప్రజలు కోరే స్వాతంత్ర్య స్వేచ్ఛలకోసం పోరాటాన్ని—జీవితము కోరుతోంది. టాలెర్ మొదటిరోజుల్లో ప్రేమించే హాప్ట్‌మన్‌లాంటి కవులు పూర్వము ఉన్నారు. హాప్ట్‌మన్ 'వీవర్స్' అనే గ్రంథములో పీడితవర్గములో పనిచేసే జీవాన్ని పరిచయము చేశాడు. టాలెర్ వ్రాసిన 'మాసెస్ మెన్ష్', 'మెషిన్ రెకర్స్' అనే గ్రంథాలు అదే పోరాటాన్ని ప్రతిబింబింప జేస్తవి. ఈ నాటకాలను వ్రాసినపుడు అతనిభావాలింకా స్థిరపడలేదు. ఒకో నాటకము వ్రాసినకొద్దీ, అతనిలో ఒకడుగు ముందు వేయడం చూస్తాము. 'హింకీమాన్' అనే గ్రంథము యుద్ధాన్ని—దానివలన జరిగే మానవ వినాశాన్ని—నిరసించే గ్రంథం. ఇందులో ఒక దృఢమైన సైనికుడు యుద్ధములో తన అవయవాన్ని పోగొట్టుకుంటాడు. కృత్రిమ సాంఘిక విధానములో నిర్మింపబడ్డ కుటుంబములో, ఇందువలన అత డనుభవించే బాధలను వర్ణించాడు. టాలెర్ మరో గ్రంథంలో వేదాంతుల్ని (స్పిరిట్యులిస్టుల) పరిహసించాడు. 'టెక్నికల్'గాకూడ ఇది అతని రచనలలో ఉత్తమోత్తమమైనది. "హోప్లా, వుయ్ లివ్" అనే గ్రంథం కొన్నేండ్లక్రిందట ప్రపంచమంతనూ దిగ్భ్రమకల్గించింది. (అతడపుడే జైలునుంచి వచ్చాడు.) అందులో ఒక అనార్కిస్టు ఉరి పోసుకొని చస్తే అతనివంక జూచి మరొకపాత్ర ఇలాఅంటాడు. "కమ్యూనిస్టు ఎపుడూ అలా ఆత్మహత్య చేసికోడు:....

### యుద్ధంవలని పాఠం!

టాలెర్ జీవితములో ఒక్క నరకం గాదు—అనేక నరకా లున్నాయి. గత ప్రపంచ యుద్ధములో అతడు జర్మనీతరపున పోరాడాడు. కైజర్‌కు ఏమీ పార్టీలులేవని ఇతని దృఢవిశ్వాసం. "ప్రతివాడూ తన మాతృదేశాన్ని—జర్మనీని—రక్షించుకోవాలి!" "జర్మనీ ఫ్రాంసుచేత ధ్వంసము కాబడింది. ఫ్రెంచివారు బవేరియా క్షేత్రములో బాంబులు వేశారు. జర్మనీ పరదేశాక్రమణకు గురియైంది." అని అతడు నమ్మాడు. ఇదంతా పత్రికల ప్రభావం. కొద్దిమంది ప్రభువులు గావించిన యుద్ధ ప్రచార ఫలితం; భావుకుడు—కవి—టాలెర్, రాజు కోసం, దేశం కోసం యుద్ధంచేసే సైనికుడయ్యాడు.



ద్రిల్లు—డ్రిల్లు—డ్రిల్లు—ఒకటే డ్రిల్లు చేశాడు.

"నీవు కవివి కాదూ?" అన్నాడు మేజర్.

"అవును, సర్"

"స్వేచ్ఛాగీతం. అ?! చిన్న రొమాంటిక్ యుద్ధం—అంతా నీ స్వానుభవంతో నీకు కావాలికదూ."

"బోయిస్—లీ—ప్రెట్రీ వద్ద మెషిన్‌గన్ సెక్షన్ గురించి నే నాలోచిస్తున్నాను."

"నీయిష్టం, నీవేమైనా కా[illegible]వ్యాలు వ్రాస్తే నాకు పంపాలి సుమా" ... టాలెర్ ఆ ఋట్టి కందకాలలో గుంపులు గుంపులుగా ఉన్న సైనికులతో ఎలా జీవించాడో ఊహించండి. "గోడల మీద బొట్లు బొట్లుగా నీళ్ళు కారేవి. మా రొట్టెలను ఎలుకలు కొరికేవి." ఇలాంటిచోట్ల టాలెర్—ప్రతిరోజూ స్నేహితులసంఖ్య తగ్గిపోతూ ఉండేది. ఇవాళ పది. రేపు ఏడేకావచ్చు! రాలిపోయినవారిలో ఒకడు టాలెర్ కావచ్చు! "తరచుగా శరీరాలు ముక్కలు ముక్కలై పోయేవి. ఏదో చెట్టు మొదళ్ళలో ఇరుక్కుపోయిన మాంసపుముక్కలు తెలిపేవి ఫలానా చోట మనిషి చనిపోయాడని.".....

టాలెర్‌లో యుద్ధం ఒక నూతన జ్ఞానాన్ని రేకెత్తించింది."యుద్ధమే నన్ను యుద్ధ వ్యతిరేకిగా మార్చింది." అన్నాడు, ఈ శతాబ్దంలో యుద్ధం మహా పాతకం, తనకు ఈ యుద్ధానికి కారకులయిన వారెవరో మొదట తెలియదని ఒప్పుకొన్నాడు.బంగారం, భూమి, గనులు, నూనె—కొద్దిమంది ప్రభువుల చేతులలో ఉన్నాయి. వీటి కోసం మనుష్యులు గొంతులు నరుక్కొని చావాలి లేదా బ్రతికి ఉన్న వాళ్లు నెమ్మదిగా నైరాశ్యంతో, ఆకలితో కృశించి చావాలి: అది 'కేపిటలిజం' (పెట్టుబడిదారీ విధానం) యొక్క నేరం. యుద్ధం వలని దోషం—ఇది తెలుసుకొన్నాడు టాలెర్.

ఆపుడే 'సోషలిజం' అనే భావన అతనిలో ప్రవేశించింది. ఆ సమయంలోనే, కార్మికుల నాయకుడగు ఈస్నెర్‌ను కలిసికొన్నాడు. స్ట్రయికు కమిటీ మీటింగులకు హాజరు కావడం ప్రారంభించాడు. ఈ ఆశయం కోసం తనను ధారవోయడానికి నిశ్చయించుకొన్నాడు. ఇది అతనికి కొత్త. బడిలో చదువుకొను రోజుల్లో—చిన్నప్పుడు—సోషలిస్టులు ప్రభుత్వాన్ని నాశనం చేస్తారనీ, వాళ్ల బందిపోటు దొంగలనీ విన్నాడు. అంతే! వెంటనే కార్మికులను ప్రబోధించ సాగాడు. ఒక పెద్ద ఫ్యాక్టరీలో సమ్మెలో చేరమని కార్మికులను ప్రోత్సహించాడు. ఈ నూతన ఉద్యమంలో శక్తి, ఉత్సాహము, ఇదివరకు కంటె సంపూర్ణ—సఫల జీవితమూ! నూతన భావమూ, చూడసాగాడు. త్వరలోనే టాలెర్‌ను అరెస్టు చేశారు పరీక్షించడానికి. చాలనేపు క్రాస్-ఎగ్జామినేషన్ చేశాక, ఒక ఆఫీసరూ ఇద్దరు ప్రయివేట్లూ, బాయ్‌నెట్లు గురిచేసి, మ్యూనిక్ వీధులలో గుండా టాలెర్‌ను నడిపించారు. పిల్లలు అతని వెంబడపడ్డారు, ఒక కుర్రాడు "ఖూనీ చేశాడు" అని అరిచాడు.... మిలటరీ ఖైదీ గేట్లు అతన్ని మూసివేశాయి.

### 1918 విప్లవంలో

అది టాలెర్ నిజమగు రాజకీయ చరిత్రకు నాంది! ఇదే ఇతని నిజమగు సాహిత్య జీవితారంభంకూడా అనిచెప్పవచ్చు. ఎందుకనంటే, నేడు జీవించియున్న కళావేత్తలు, రచయితలు తప్పక రాజకీయాలతో సంబంధం కల్గియున్నారు. వారు ఏదో ఒకఆశయాన్ని చిత్రించుతారు. అది ఏదన్నా కానీయండి. వాళ్ళు ప్రచారకులు. వారి కాలంలోని రాజకీయదశలనుండి తప్పించుకు పోలేరు, వాళ్ల ఏపక్షాన్ని సపోర్టు చేస్తున్నారు? ఏభావాన్ని వెలిబుచ్చదలిచారు? ఎవరిని బలపరచ దలిచారు? అనేదే భేదం. టాలెర్ కార్మిక ఉద్యమము వైపుకు తన శక్తినంతా త్రిప్పివేశాడు.

1918 లో ప్రసిద్ధి చెందిన విప్లవం ప్రారంభమైంది. బెర్లిన్ కార్మికులు, పాటలులేకుండా, ఆనందోత్సాహాలు లేకుండా, మైకెయిషర్ కొట్లవద్దకు—కైజర్ సైనికుల పహరాతో పోయారు. కాని చారిత్రిక సత్యానికి దాని స్వంత లాజిక్ ఒకటి ఉంటుంది. విప్లవాలూ, అవి గెలవడమూ దాని మీదే ఆధారపడి ఉంటవి. దానిని రష్యాలో చూచాము. జార్ ప్రభువుల శ్వేత సైన్యము కార్మికులను కాల్చడానికి సిద్ధముగా ఉంది. హఠాత్తుగా సైనికులు సత్యాన్ని కనుగొన్నారు. వారిలో కలిసిపోయి, వారిని కాల్చడానికి బదులుగా జారుప్రభువు ప్రాసాదం వైపుకుకాల్చారు.ప్రజలు రాజ్యాధికారాన్నిపట్టుకొన్నారు; దగ్గరగా వస్తున్న గుంపుల్ని కంతఋగుండా, కిటికీల గుండా కాల్చడానికి కూర్చున్న కైజర్ సైనికులే బయటకు పర్వెత్తి వచ్చేశారు, గుంపులతో కలిసిపోయారు, గేట్లు తెరిచారు, సామ్రాజ్య పతాకాన్ని దింపి ఎర్ర బావుటాను ఎగురవేశారు. సామ్రాజ్య ప్రాసాదాంగణం నుండియే లిబ్నెక్, జర్మన్ సోషలిస్టు రిపబ్లిక్‌ను ప్రకటించాడు. కాని ఈసమయంలో, సోషల్ డెమాక్రేటులు తమ కొత్త రాజ్యాంగ శాసనం బిల్లు తయారు చేస్తున్నారు. సోషల్ డెమాక్రేటులనూ, మానార్కిస్టులను తోసివేయడానికి, కార్మిక కర్షకులను తన వైపుకు ఈస్నెర్ త్రిప్పుకొన్నాడు.

బవేరియా రాజు విప్లవకారులకు అంతావదలి పలాయన మంత్రం పుచ్చుకొన్నాడు. ఈస్నెర్, మరో అంధ కర్షకుడైన గ్రాండార్పర్, పట్టణంలో ఊరేగారు. సైనిక, కార్మిక కౌన్సిలుకు ఈస్నెర్‌ను ప్రెసిడెంటుగా ఎన్నుకొన్నారు. కేంద్ర కమిటీకి ఉపాధ్యక్షునిగా టాలెర్‌ను ఎన్నుకొన్నారు. కొన్ని రోజుల తర్వాత స్పార్టకస్ (కమ్యూనిస్టు) విప్లవము వచ్చినపుడు, కారల్ లిబ్నెక్, రోజాలగ్జంబర్గ్‌లు హత్య గావించబడ్డారు. విప్లవ ప్రతికూలశక్తులు విజృంభింపసాగాయి. మరికొన్నాళ్ళకు,ఆర్కో, ఈస్నెర్‌ను కాల్చిచంపాడు. కాని ప్రజలు పగ తీర్చుకోదలిచారు. దాని ఫలితము అనేక కష్టనష్టాలను ఎదుర్కొని బవేరియన్ సోవియటు రిపబ్లిక్‌ను స్థాపించారు. కాని విప్లవకారులలోనే అల్పమైన తగాదాలు జనించడం విచారకరము. ఒకప్రక్క ఉత్తరభాగాన, వీళ్ళ శత్రువులు వీరిపై దాడిసల్పడానికి సైన్యాన్ని ప్రోవుచేస్తున్న సమయంలోనే ఈతగాదాలు వచ్చాయి. సోవియటు రిపబ్లిక్ నాశనమయింది. ఎన్నో గందరగోళాల తర్వాత—జయాపజయాల తర్వాత, శత్రువులే అధికారానికి వచ్చారు. రహస్య ద్వారము గల ఒక చోట పటాలు, పుస్తకాల బీరువాలు వెనుక దాక్కొని ఉండగా టాలెర్‌ను అరెస్టు చేశారు. చర్చికి వెళుతున్న ఒకముసలమ్మ "దొరికాడా!చంపండి, చంపండి వెధవను" అని, ఏసు ప్రభుని ప్రార్థనకయి చర్చికి బయలుదేరింది!

### జైలులో

జైలులో టాలెర్ 5 ఏండ్లున్నాడు. ఆ సెల్‌లో గూడుకట్టుకొన్న ఒక పిట్ట (స్వాలో) తో స్నేహం చేశాడు. దానిని తీసేయాలని జైలు అధికారులు తలచినపుడు టాలెర్ అతిదీనంగా ప్రార్థించాడు దాన్ని తీసివేయవలదని. ఆ మహాకవితో స్నేహం సంపాదించిందా పక్షి. ఇపుడు "స్వాలోబుక్" అని ప్రసిద్ధి చెందిన గ్రంథాన్ని వ్రాయడానికి ఉత్సాహాన్నికూడా ఇచ్చింది ఆపక్షే! ఈపుస్తకం టాలెర్ వ్రాసిన వాటిల్లో కల్ల చాల 'పొయిటిక్' గా ఉంది. దానినిండా కరుణామయ చిత్రాలు, కన్నీరొలికెడి గాథలు ఉన్నాయి. జైలులో అయిదేండ్లు పడివుండటం! అతడు జైల్లో చిన్నకొట్లోపడి కొట్టుకుంటున్నప్పుడు, బయట అతని రచనలు, పాప్యులర్ కాజొచ్చినయి. అతనికి విశ్వవిఖ్యాతిని కొని తేసాగినాయ్, మనదేశంలోతప్ప. ఇంగ్లండు, జపాను, చైనా, అమెరికా రష్యాలలో అతని కీర్తి ప్రాకింది. టాలెర్ నామమే మంత్రశక్తి. అతడొక మూర్తీభవించిన ఉత్సాహం (ఇన్స్పిరేషన్.) జీవశక్తి. దోపిడిని, అన్యాయాన్ని ఎదుర్కొని పోరాడే వీరుల రక్తనాళాలలో ఎలిక్ట్రిక్ ఎనర్జీ అతడు. అతడు జైలు నుంచి బయటపడ్డప్పుడు ఇంకా అతనికి 30 ఏండ్లు నిండలేదు. అతని తల నెరసిపోయింది, కాని నిజమైన విప్లవకారిగాబట్టి అతడు అలసట జెందలేదు.

ప్రపంచ విప్లవాన్ని, దాని బలహీనతలను, శక్తులను రిజిస్టర్ చేసిన మహాకవికి ఉదాహరణమే టాలెర్, చివర రోజుల్లో, అతని కాలమూ, ఉపన్యాసాలు, స్పైన్ కోసం ఉపయోగించాడు. ఈ రోజుల్లోనే, ఇతడు వ్రాతల్లోను, జీవితంలోనూ గట్టిపడ్డాడు. కాబట్టి "తన దుస్తుల త్రాటితో ఉరిపోసుకొని చచ్చిపడి ఉన్నాడు. ఆత్మహత్య అని అనుమానం, కాని నిర్ధారణ కాలేదు" అని వినడం చాల ఆశ్చర్యంగా ఉంది... ప్రతిచోటా నాజీ ఏజంట్లు పనిచేస్తున్నారని వినికిడి. కొంతకాలం క్రిందట, టాలెర్ స్నేహితురాలొకతె లండన్‌లో ఒక గదిలో ఇలాగే చచ్చిపడివుంది. కాని కారణమేమిటో ఎవరికీ తెలియదు. అనేక భిన్న ఆశయాలు, భావాలు గల ఈరోజుల్లో కొంత అనుమానింపవలసి వస్తుంది, ఒక్కొకసారి ఆ అనుమానాలు రుజువవుతున్నాయి కూడా.

అనేకసార్లు, టాలెర్ ఆత్మహత్య చేసికోవాలని తలచడము, దానిని గురించి ఊగులాడటం నిజమే, కాని చివరి రోజుల్లో అతని మనస్సులో పరిపక్వత వచ్చింది. తాను బ్రతికి సేవ చేయాలే గాని చావగూడదనే నమ్మకము కూడా ఏర్పడింది. అయితే అతడెలా చచ్చిపోయాడు?నిస్సహాయస్థితిలో—ఉన్మత్తావస్థలో ఆత్మహత్య చేసికొన్నాడా? కాని అతడిక అనార్కిస్టు కాడే! .... ...అనార్కీని వదలివేసి ఎన్నో ఏండ్లయిందే... 'హోప్లా' అనే అతని గ్రంథంనుండే అతనిమాటలలో చెప్పాలంటే "కమ్యూనిస్టు ఎప్పుడూ అలా చావడు"...........

---

**తూ. గో. జిల్లా రైతుస్థాయి సంఘ సమావేశము.**

19-7-39 బుధవారం మధ్యాహ్నం 2 గంటలకు పైసమావేశము రాజమండ్రిలో సంఘ కార్యాలయమందు యీక్రింది విషయముల చర్చించుటకు జరుగును గాన సభ్యులెల్లరు విచ్చేయ ప్రార్థన.

కార్యక్రమం

1. కార్యనివేదిక (2) జమా ఖర్చులు (3) అధ్యక్ష కార్యదర్శి, కార్య వర్గ ఎన్నికలు. (4) కార్యదర్శి ప్రవేశపెట్టు యితర విషయములు.

ఇట్లు

రాజమండ్రి 8—7—39 } పెన్మెత్స సూర్యనారాయణ ప్రధాన కార్యదర్శి

# చైనా యుద్ధ తృతీయ వర్షారంభం!

## చైనా-జపాను యుద్ధం : ఆంగ్లో సోవియట్ సంభాషణలు : డాంజిగ్ సమస్య

జులై 7 వ తేదీన చైనా జపాను యుద్ధం రెండేళ్లు పూర్తిఅయి, మూడో సంవత్సరం ప్రారంభమయింది. ఇది మహాయుద్ధమేనని ప్రపంచమంతా ఒప్పుకున్నా జపాను వాక్యాలలో ఇది ఒక ఘటనమాత్రమే. యుద్ధం అని ప్రకటించకుండానే యుద్ధం చేస్తూంది జపాను. ఈ రెండేళ్ల యుద్ధఫలితాలను ఒకసారి సింహావలోకనం చేద్దాం.

### యుద్ధ ప్రారంభం

మంచూరియా, జీహోల్, అను కాజేసినా జపాను సామ్రాజ్యకాంక్ష అంతరించలేదు. 1937 జులై 7 వ తేదీన జపాను చైనా సైనికులను రెచ్చగొట్టింది. పీపింగ్‌కు సమీపంగా ఉన్న మార్కోపోలో బ్రిడ్జివద్ద చైనా జపాను సైనికుల ఘర్షణ ప్రారంభమయింది. ఇదే యుద్ధప్రారంభం అన్నమాట. జపాను, మొట్ట మొదట చైనాను జయించడం "మూన్నాళ్లు" అని ప్రగల్భాలు కొట్టింది. భ్రమసింది కూడా. కాని ఇప్పటికి తెలిసివచ్చింది. జపాను యుద్ధ మంత్రి జనరల్ ఇటగాకీ "జపాను 5 గాని, 10 గాని, 20 ఏండ్లయినాసరే పోరాడటానికి సిద్ధంగా ఉండాలి" అని చెప్పాడు.

మరణ సంఖ్య.

ఈ రెండేళ్ల యుద్ధ ఫలితంగా చైనా వారు పది లక్షలమంది చనిపోయారు. మరో పదిలక్షల మంది గాయపడ్డారు. జపానువారు నాలుగు లక్షలమంది చనిపోయారు. 6 లక్షలమంది గాయపడ్డారు.

జంగ్ - కే - షేక్

### జపానుగెల్చినప్రదేశాలు

జపాను గెల్చిన ముఖ్యపట్టణాలు ఇవి:— కాంటన్, అమాయ్, షాంఘై, నాంకింగ్, సింగ్టావ్, హాంకో, పీపింగ్, టీన్ట్సిన్. ఇవి గాక జపాను జయించిన ముఖ్య రైల్వే లైన్లు ఇవి:- షాంఘై-నాంకింగ్; షాంఘై-హాంగ్‌చౌ; టీంట్సిన్-పూకౌ రైల్వేలు; ఇంకా పీపింగ్-హాంకో రైల్వేలలోని కొంతభాగమూ. చైనాలోని నేత పరిశ్రమ అంతా దాదాపు జపానుచేతిలోకి పోయింది. చాలాచోట్ల గెల్చినా, ఆ గెల్చిన ప్రదేశాలలో శాంతిలేదు.

నాంకింగ్, పీపింగ్‌లలో "కీలుబొమ్మ ప్రభుత్వాలు" జపాను నెలకొల్పింది. కాని ఎవరూ- జపానుకూడా-గుర్తించలేదు. ఈరెండు కలపి ఒక 'జాతీయ పరిపాలన' క్రిందకు తేవాలన్న ప్రయత్నాలు కూడా విఫల మయ్యాయి.

### సంధి ప్రయత్నాలు

నాంకింగ్ పతనానికిముందు జర్మన్ విదేశ రాయబారి డాక్టర్ ఆస్కార్ ట్రాంట్‌మన్ కొన్ని సంధి సూచనలు కావించాడు. కాని చైనా తిరస్కరించింది. 1938 డిసెంబరులో ప్రిన్స్‌కోనోయీ కూడా కొన్ని సూచనలు కావించాడు గాని వీటినికూడా చైనా తిరస్కరించింది. దానిఫలితంగా కోనోయీ (జపాను) రాజీనామా నిచ్చాడు.

వాంగ్-చింగ్-వై (చైనా కుమిన్‌టాంగ్ కార్యనిర్వాహక సభ్యుడు) గత సంవత్సరం రహస్యంగా ఇండో చైనాకు పారిపోయి కొన్ని సంధిసూచనలు ప్రకటించాడు. ఈదేశద్రోహిని వెంటనే అతని పదవులనుండి తొలగించి అరెస్టు చేయడానికి ఉత్తర్వు లిచ్చారు జంగ్-కే-షేక్. నాంకింగ్-పీపింగ్‌లను కలిపి, జపాను కీలుబొమ్మ రాజుగా ఇతన్ని నియమించాలని జపాను ప్రయత్నం. కాని ఇది ఇంత వరకు నెరవేరలేదు.

### సామ్రాజ్య వ్యతిరేక సంఘటన.

కుమిన్‌టాంగ్ ప్రభుత్వం ఒకప్పుడు చైనా కమ్యూనిస్టులను చిత్రవధగావించింది. జపాను సామ్రాజ్య భయం కంటె, కమ్యూనిస్టు భయం అనాడు జంగ్-కే-షేక్‌కు ఉన్నది. ఎంతో ఆహుతిగావించి, ఎన్నో కష్టాలను ఎదుర్కొని కమ్యూనిస్టు ప్రభుత్వాన్ని కొంతభాగంలో ఏర్పరచుకున్నారు. మొదటినుండీ జపానును ఎదిరించడానికి ప్రోత్సహించుతూ వచ్చారు కమ్యూనిస్టులు చిట్టచివరకు కమ్యూనిస్టు ప్రభుత్వాన్నే రద్దుచేసి, జపాను దాడి నెదుర్కొనడానికి జంగ్-కే-షేక్ ప్రభుత్వంతో చేతులు కలిపి అకుంఠితత్యాగాన్ని చూపించారు కమ్యూనిస్టులు. నేడు కమ్యూనిస్టుల 8 వ రూట్-ఆర్మీ, 4 వ రూట్-ఆర్మీలే గొరిల్లా యుద్ధాలతో జపానును చికాకు పరుస్తున్నాయి.

### చైనా : ఇతరదేశాలు

అయినప్పటికీ చైనాకు ఇతరదేశాల సహాయం తక్కువ. ఆయుధాలు తక్కువ. ధన సహాయం తక్కువ. ఒక్క సోవియట్ యూనియన్ మాత్రం సహాయంచేస్తూ వచ్చింది. సోవియట్ విమానాలు, వైమానికులు పంపబడ్డారు. ఆయుధాలను పంపింది. కాని భౌగోళిక పరిస్థితుల ననుసరించి ఈసహాయం రావడం అతికష్టం. ఒక్క సోవియట్ రష్యాతప్పితే చైనాలో తమకెన్నో ఆపదలు ఘటిల్లుతున్నా ఫ్రెంచి, అమెరికన్, బ్రిటిషు సామ్రాజ్యాలు మెదలకుండా ఊరుకుంటున్నాయి. జంగ్-కే-షేక్ చెప్పినట్లు జపాను (1) నానాజాతి సమితిని ఉల్లంఘించింది (2) వాషింగ్‌టన్ సంధిని ఉల్లంఘించింది (3) కెల్లాగ్‌సంధిని ఉల్లంఘించింది. ఇన్నిచేసినా జపానుపై ఆర్థిక ఆంక్షలు విధించలేదు నానాసమితి. వ్యక్తిగతముగా చేయదగ్గ సహాయం చేయమని ఆయాదేశాలను సమితి ప్రార్థించింది. కాని సహాయం చేసిందెవరు? బ్రిటన్ సహాయంచేసినా, చైనా జయించడానికి తగినంతగా చేయడంలేదు. ఈ రెండేళ్లల్లో విదేశ సామ్రాజ్యాలకు గల్గిన అవమాన పరంపరలు చూద్దాం. 1937 డిసెంబరులో యాంగెట్సీనదిపైన అమెరికన్ యుద్ధనౌకపై బాంబులువేసి ముంచివేసింది. 1937 ఆగస్టులో బ్రిటిష్ రాయబారిని కాల్చడం. తర్వాత ఫ్రెంచివారిని రెచ్చగొట్టే హైనాన్ దీవి ఆక్రమణ, ఇక ట్రీటీరేవుల ముట్టడించడం. టీన్ట్సిన్ ముట్టడిలో బ్రిటన్‌కు జరిగిన మర్యాదలు వేరే చెప్పనక్కరలేదు.

### ఈ వారం విశేషాలు

సంధి చేసుకుంటారని అనుమానించే వారికి అపోహలు లేకుండా, జంగ్-కై-షేక్ తన సందేశంలో విస్పష్ట పరిచాడు. "వారు చెప్పే సంధి, నిజమయిన సంధి కాదు. ద్రోహులు చెప్పే సంధి" అన్నాడు. యాంగెట్సీ ఫ్రంటు సైనిక నాయకుడగు చన్‌చాంగ్ "1941 నాటికి విజయంమాదే" అని అన్నాడు. మేడం జంగ్-కై-షేక్ కూడ విదేశ ప్రభుత్వాలను జపానుపై ఆర్థిక ఆంక్ష విధించమని ప్రార్థించింది.

టీన్ట్సిన్ సమస్యను పరిష్కరించడానికి జపాను బ్రిటనులు టోకియోలో సంభాషణలు సాగించడానికి అంగీకరించినా, బ్రిటిషు ప్రభుత్వ వ్యతిరేక ప్రదర్శనాలు,సభలు మానలేదు. సింగ్‌టావ్‌లో ప్రదర్శనాలు జరిపారు. కన్సెషన్ ప్రదేశాలలోని వెండిని జపానుకు ఈయాలంటూ నినాదాలు పలికారు. ఉత్తర చైనాలో సాగించిన బ్రిటిషు వ్యతిరేక ఉద్యమ ఫలితముగా అనేక పట్టణాలలో బ్రిటిషు మిషన్ ఆస్తిని తగలపెట్టారనీ, చైనా క్రిస్టియనులను అరెస్టుచేసి ఉరితీశారనీ చైనావారు తెల్పుచున్నారు. దీనికి తోడు జపాను ప్రధాని, తన సందేశములో "తూర్పుఆసియాలో 'నూతన విధానాన్ని' నెలకొల్పే మా ఉద్యమానికి బ్రిటన్ సహకారము చేయందే (బ్రిటనుతో) నిజమైన పరిష్కారము జరగదు." అని అన్నాడు.

మళ్లా జపాను తన దాడిని సాగించింది. ఇటలీనుండి స్పెయిన్‌లో అనుభవం గడించిన కొన్న మిలిటరీ సైన్యాధిపతులు జపానుకు సహాయం చేయడానికి వెళ్లుతున్నారట! చంగ్-కింగ్ నగరంపైన 27 సార్లు బాంబుల విసిరాయి జపాను విమానాలు. ఒకసారి బ్రతికి ఉండగానే 30 మంది ఒక కందకములో పూడిపోయారు. ఇట్టి అమానుష పద్ధతులను అవలంబించుతున్నా జపానును, కాంటన్ ఉత్తర దక్షిణ భాగాల్లోను; కాంటన్-హాంకో రైల్వేల ప్రక్కనూ చైనా ఎదిరించి ఓడించింది. అనేక గ్రామాలను వశపరుచుకొన్నది. షాంకింగ్-నాంకింగ్‌లను కలిపే బాటకు దగ్గరగా గొరిల్లా సైన్యాలు విజృంభించాయి.

గొరిల్లా సేనా నాయకుడు
కమ్యూనిస్టు : చూ టే

జపాను బాంబులచే మరణించిన చైనా అభాగ్యవతి

రెండేళ్లు ఇలా గుంజుకొని వచ్చిన చైనా భవిష్యత్తేమిటి? బ్రిటన్ జపానుల సంబంధం ఎలా ఉంటుంది? ఈ విషయాలు చర్చించాలి.

## నేటి ప్రపంచం

### బ్రిటన్ : జపాను

ఇవుడు జపాను కోర్కెలేమిటి?

1. జపానుచేతిలో కీలుబొమ్మఅయిన ఒక విద్రోహిని చంపిన చైనావారిని (కమ్యూనిస్టులను) అప్పజెప్పాలి. ఈ అప్పజెప్పడంతోనే సరిపోదు.

2. జపాను వ్యతిరేకులందరినీ శిక్షించుతూ బ్రిటిషువారు జపాను పోలీసులలాగా, తమ కన్సెషన్స్‌లో పనిచేయాలట.

3. బ్రిటిష్ కన్సెషన్స్‌లోని 12,000,000 పౌనుల చైనావారి వెండిని జపానుకు అప్పజెప్పాలట.

మొదటి రెండింటికీ బ్రిటన్ ఒప్పుకుంటుందని ప్రఖ్యాత జర్నలిస్టు కె. జిల్లియకస్ వ్రాస్తున్నాడు. అంటే దానిఅర్థంఏమిటి? షాంఘై ఇంటర్నేషనల్ సెటిల్‌మెంటులోను, ఇతర కన్సెషన్ ప్రదేశాలలోను జపాను సైనికులను విచ్చలవిడిగా తిరగనీయడం: తలదాచుకోవచ్చిన దేశద్రోహులుకాని చైనావారిని జపాను దౌర్జన్యాలకు అప్పజెప్పటం. ఇంతకూ బ్రిటన్ చైనా ఎలాపోయినా సరే తమ హక్కులు కాపాడితేచాలు. ఇదేధోరణి 1931 నుండి కొనసాగిస్తూ వచ్చింది. జిల్లియకస్ చెప్పినట్లు "బ్రిటన్, జపానుకు చైనాలో ఇష్టం వచ్చినట్లు దోచుకోడానికి, హత్యలు గావించడానికి సంపూర్ణ స్వాతంత్ర్యం ఇస్తుంది. తను కోరేదల్లా "బ్రిటిషు హక్కులను కాపాడటం"

ఈ ధోరణినే ఇదివర కొకసారి పార్లమెంటులో వెల్లడించాడు ఛాంబర్లేను. "చైనాలో ఏ సమస్య అయితే మనకేం? పునర్నిర్మాణానికి డబ్బు కావాలి. ఎవరుగెల్చినా లండనుకు అప్పుకోసము పరుగెత్తుకు రావాలి" అన్నాడు. అంటే చైనా ఎంత విధ్వంసమయితే అంత మంచిదన్నమాట! ఈ ధోరణినే గటగటా స్పెయినులో విద్రోహులు గెలిచేటట్లు చేసారు. కాబట్టి బ్రిటనుకు రెండేదార్లు ఉన్నాయి.

"ప్రపంచ యుద్ధమో లేక మళ్ళా తల ఎత్తుకోకుండా—లొంగిపోవడమో."

నేడు సోవియటు సహాయము చేస్తోంది చైనాకు. దానితో కలిసి, అమెరికాను కలుపుకొని జపాను దాడి నరికట్టాలి. కాని సంతృప్తి విధానముతో చచ్చిపోయే ఛాంబర్లేను అందుకు ఒప్పుకోడు. జిల్లియకస్ వ్రాసినట్లు "ప్రాచ్యదేశములో జపాను మిలిటరీ ఆఫీసర్ల వలన ఛాంబర్లేను మట్టి తినటానికీ, రక్తపుటేరుల్లో దొర్లడానికయినా ఒప్పుకొంటాడు గాని, సోవియటు సహాయము చేస్తున్న చైనా గెలవడానికి సహాయపడడు."

కాబట్టి ఛాంబర్లేను ప్రభుత్వ పతనంలోనూ, ప్రజాస్వామ్య విజయంమీదనుకూడా చైనా విజయం ఆధారపడి ఉందని చెప్పాలి.

### సోవియట్-జపాను ఘర్షణ

ఒక ప్రక్క చైనాతోనేగాక అటు సోవియటుతో ఘర్షణ సాగించుతోంది జపాను. బూయిర్నర్ సరస్సువద్ద, మంచూకో, మంగోల్ సరిహద్దులవద్ద యుద్ధం సాగుతోంది. వైమానిక యుద్ధంకూడా తీవ్రంగా సాగుతోంది. జపాను లెక్కల ప్రకారం నోమన్‌హాన్ వద్ద మంగోలియన్ సైనికులు 4000 మంది ఉన్నారట, మాస్కోవార్తల ప్రకారం ఈ యుద్ధంలోని ఇరుపక్షాల నష్టమూ ఈక్రింది విధంగా ఉంది. జపానువారివి 50 టాంకులు నాశనమయ్యాయి. 8 గన్‌లు పాడైపోయాయి. 800 మంది చనిపోయారు. సోవియటు సైనికులు 100 మంది చనిపోయారు. సోవియటు టాంకులు 25 నాశనమయాయి. విమాన యుద్ధంలో జపాను విమానాలు, 9 సోవియటు విమానాలు కూలిపోయాయి సోవియట్ మంగోలియన్ సైనికులు వెనక్కి తిరిగిపోయారనీ, సోవియట్ సైనికులు కొందరు అరెస్టు చేయబడ్డారనీ, జపాను తెల్పుచున్నది నిజమైన శాంతిని కోరాలంటే సోవియట్‌తో సంధిచేసుకొని ఇటు చైనాకు, సహాయం గావిస్తూ, అటు యూరపులో దురాక్రమణను నిరోధించాలి. కాని ఆంగ్లో-సోవియట్ సంభాషణలు యింతవరకు తేలనేలేదు.

### ఆంగ్లో : సోవియటు సంభాషణలు

ఆంగ్లో-సోవియటు సంభాషణలు సాగుతున్నాయి. కాని సంధిమాత్రం జరగటం లేదు. మాస్కోవార్త ననుసరించి "బాల్టిక్ రాజ్యాల సమస్య. పరిష్కారమైనట్లు లేదు." కాని బ్రిటిషు పత్రికలు, వార్తలూ ప్రజలను కల్లోల పరుస్తున్నాయి. "అంతా సదిరింది కాని. ఇంకా కొంచెం ఉంది" అనీ, "24 గంటల లోగా సోవియటు యూనియన్ సంధికి రాకపోతే, ఫ్రాంసు — సోవియటుల సంధికూడా రద్దుపరచుతామని" బెదరించారనీ, గందరగోళపు వార్తలు నింపుతున్నారు. పైగా సోవియటు బేరాలు ఆడటంలో తక్కువతినలేదనీ, అయినా ఇంత ఆలస్యంగా సంధిచేసుకొన్నా లాభం ఏమిటనీ, సోవియటు యూనియన్‌కు వ్యతిరేక ప్రచారం సాగిస్తున్నారు. దీని అర్థంఏమిటి?

బోనెట్

ఇదిగో సంధి, అదిగోసంధి అని ప్రజలను మభ్యపెట్టడానికేగాని, నిజంగా బోనెట్—ఛాంబర్లేనులు ఈసంధిని కోరడంలేదు. ఇందుకు ఉదాహరణ జూన్ 23 వ తేదీన ఒక పారిస్ పత్రిక ఇలా వ్రాసింది.

"ఫ్రెంచి విదేశాంగమంత్రి సలహా సంప్రదింపులతోనే, జక్కు (బొహిమియా మొరేవియాల) ఆక్రమణ జరిగింది." ఇలాంటి విదేశాంగ మంత్రి బోనెట్ ఉన్నంతకాలము సోవియటుతో సంధి కుదురుతుందా? అదే పత్రిక ఇలా వ్రాసింది.

"పశ్చిమ ప్రజాస్వామ్య దేశాలకు (ఫ్రాంసు ఇంగ్లండు) సోవియటు యూనియన్‌తో సంధి అనవసరమని అభిప్రాయపడుచున్నాయి. అందుచేతనే ఈఅంతు పొంతూలేని దీర్ఘ సంభాషణలు!"

'కడుపులో మంటలేంది కావలించుకొంటే వస్తుందా' అన్నట్లుంది బ్రిటను ధోరణి. ఇపుడు మళ్ళా మదలపేచీలు పెట్టింది.

సోవియటు యూనియను కోరిన బాల్టిక్ దేశాలకు హామీ ఇస్తుందట కాని దానికి బదులుగా హాలండ్, స్విట్జర్లండు, లక్జంబర్గులకు సోవియటు హామీ యివ్వాలట! దీనికి సోవియటు తిరస్కరించింది. కాని సోవియటుతో పోలండ్, టర్కీలు తిన్నగా సంధి చేసికొంటే తాము పైవటికి హామీ నివ్వడానికి పూచీ పడతామని మొలటోవ్ సమాధాన మిచ్చాడు.

సోవియటు యూనియను ఇలా ఎందుకు సమాధానము యిచ్చిందో విచారించే ముందు బ్రిటనుచేసే విద్రోహకరమైన ఎత్తులు చూద్దాం. "డైరక్టుగాగాని, ఇన్‌డైరక్టుగాగాని దురాక్రమణ జరిగితే" అన్న వాక్యాలకి బ్రిటను నిర్వచనము ఈయలేదు. పైగా దురాక్రమణ జరిగిన సమయానికి; అన్ని దేశాలు కలిసి నిరోధించడానికి పూనుకొనే సమయానికి; మధ్య "సంప్రదింపుల కాలం" కావాలంటున్నాడు. ఇది చాలా ప్రమాదకరమయిన సంగతి ఏదోవిధముగా సోవియటుపైన దురాక్రమణకు ప్రోత్సహించి "సంప్రదింపులు"జరిగేలోగా కొంత పోగొట్టనీయడానికి చేసే ఎత్తే ఇది. ముఖ్యంగా సోవియటుకూ జర్మనీకి లడాయిపెట్టి తాము పైన చూస్తుంటానికి మార్గాలు వెదుకుతున్నాడు. అది నెరవేరకపోవడంవల్ల గొంతెమ్మ కోర్కెలు కోరుతున్నాడు ఛాంబర్లేను.

బ్రిటను రక్షణ కోరిన దేశాల ఉనికి ఎక్కడ ఉందో చూడండి.

హాలండ్, లక్జంబర్గులు జర్మనీకి పశ్చిమ భాగాన ఫ్రాంసుకు ఉత్తరాన ఉన్నాయి. స్విట్జర్లండు జర్మనీకి దక్షిణంగా ఫ్రాంసుకుతూర్పుగా ఉన్నది. ఇపుడు సోవియటు వీటికి హామీ ఇస్తుందనుకోండి! వెంటనే జర్మనీ, ఏ లక్జంబర్గు పైనో దాడివెడలుతుందనుకోండి అపుడు సోవియటు యుద్ధం చేయాలంటే ఇటు బాల్టిక్ దేశాలగుండా జర్మనీ సరిహద్దుకు పోవాలి, లేక పోలండుగుండా జర్మనీ సరిహద్దుకు పోవాలి. మూడవమార్గం బ్లాక్ సీ నుంచి. డార్డినెలిన్‌గుండా అడ్రియాటిక్ సముద్రంలోకి పోయి, ఇటలీమీదుగా స్విజర్లండుకు పరుగెత్తాలి. అంటే ఎంత కష్టమో చూడండి. పైగా వాటికి ఇటు టర్కీ సహకారం కావాలి. అటు భూమిపైగా పోవాలంటే పోలండు, రుమేనియాల సహకారం కావాలి: పోలండుతో డైరక్టుగా సంధికి రాకపోతే "జర్మనీ మా దేశంమీదకు రాలేదు. కాబట్టి మాపై దురాక్రమణ జరపడంలేదు. కాబట్టి మీసైన్యాలను మాదేశంకుండా రానీయం." అని పోలండు సోవియటుతో అనడానికి అవకాశం చిక్కుతుంది అపుడు హిట్లర్ లక్జెంబర్గులో కలుగజేసికొని యుద్ధం ప్రారంభించినా, బాల్టిక్ దేశాలగుండా హిట్లర్ దురాక్రమణ సాగిస్తాడు. నామమాత్రంగా బ్రిటన్ ఫ్రాంసులు, సోవియటుకు సాయంచేస్తామన్నా తమ స్విజర్లండు, హాలండ్‌ల కాపాడుకుంటూ కూర్చుంటారు. అపుడు నష్టపడేది సోవియటు. "కోతి, పిల్లిచేత నిప్పులోని జీడికాయలను తీయించినట్లు"ంటి సూచన. బ్రిటన్ అనేకోతి, సోవియటు అనే పిల్లిచేత, జర్మనీ అనే అగ్నిలో, హాలండ్, స్విజర్లండు, లక్జెంబర్గుల రక్షణఅనే జీడిపప్పులను కోరుతోంది. అందుకనే సోవియటు స్పష్టంగా, టర్కీ, పోలండులతో "డైరక్టు సంధి" కావాలని కోరింది.

### డాంజిగ్ సమస్య

సోవియటుతో సంధి కుదరనంతకాలము దురాక్రమణను నిరోధించడం కష్టం. అయినా డాంజిగ్ పరిస్థితులు ఎలా ఉన్నవో చూద్దాం. ఇంతవరకు "పిల్లలాడుకొనే ప్రదేశం" అనే వంకతో జర్మనీ మిలటరీ సన్నాహాలు డాంజిగ్‌లో చేస్తుంటే, పోలండు అసమ్మతి పంపలేదు. నాజీ సెనెటు విదేశ ఋణాలకు వడ్డీచెల్లించడం ఆపుచేస్తూ ఒక చట్టం గావించింది. పోలిష్ సరిహద్దులలో మాత్రం రక్షణ సన్నాహాలు జరుగుతున్నాయి. జర్మన్ బాంబర్‌పైన హెచ్చరికగా కాల్పించింది పోలండు. జర్మనీ 40 వేల మందిని కొత్తగా అవసరమైతే యుద్ధానికి ప్రోగుచేసింది. డాంజిగ్ ఫేసిస్టు నాయకుడు" పోలు జాతీయులు డాంజిగ్‌నుండి అదృశ్యమైపోవాలి"అని అన్నాడు. పాతిపోతున్న జర్మనువాణ్ణి కాల్చాడని ఒక పోలిష్ ఆఫీసరు అరెస్టు చేయబడ్డాడు. ఇంతేగాక కొయిన్గ్స్‌బర్గు-బెర్లిన్ రైల్వేను భగ్నం చేయడానికి ప్రయత్నాలు జరిగాయి. ఇది జర్మనీ రెచ్చగొట్టడానికి చేసిన కుట్ర అని పోలండు, జర్మనీపై పోలండు చేసే దారుణకృత్యమని జర్మనీ అన్నాయి. బొంబాయిలోని పోలిష్ కాన్సల్ మరొక, "మ్యూనిక్" డాంజిగ్‌పై జరగడం అసాధ్య మంటున్నాడు. కాని బ్రిటను ఫ్రాంసుల చేతల మాత్రము అలా ఉండటం లేదు. పోలండు అసమ్మతి చూపకపోవడము అలా ఉంచి, ఫ్రాంసు, ఇంగ్లండు, పోలండులు సంయుక్తముగా దెమార్ష్ (Demarche) చేస్తారా అని అడిగితే బట్లర్ సమాధానం చెప్పలేదు, "అవసరమైన పనులు" చేస్తాం అని మాత్రం అని ప్రధాని సమాధాన మిచ్చాడు.

ఛాంబర్లేను ఉపన్యాసం.

ఛాంబర్లేను ఉపన్యాస సారాంశం ఇది.

1. జర్మనీ డాంజిగ్‌లో తిరుగుబాటుతేరాదు. తెస్తే పోలండు తన స్వాతంత్ర్యం భంగమయినట్లు తలుస్తుంది.

2. పోలండు యుద్ధంలోచిక్కుంటే బ్రిటన్ సహాయం చేస్తుంది.

3. ఇంకా సంధికి అవకాశంఉంది.

మూడవ విషయమే ముఖ్యమైనది. మొదటి రెండు పరిస్థితులు కల్గకుండా, సంధి సంప్రదింపులు జరిగితే నేను మరొక 'మ్యూనిక్' అరేంజ్ చేస్తానని ఛాంబర్లేను ఉపన్యాససారం. ఎవరో అన్నట్లు ఛాంబర్లేను,

"డాంజిగ్‌లో విషమ పరిస్థితు లేర్పడ్డాయి కాబట్టి, జపానుతో యుద్ధం వద్దంటాడు. జపానుతో విషమ పరిస్థితులేర్పడ్డాయి కాబట్టి డాంజిగ్‌లో యుద్ధం వద్దంటాడు." ఛాంబర్లేనుకు రెండే మార్గాలున్నాయి. ప్రపంచయుద్ధమా? బ్రిటన్ పెద్ద సామ్రాజ్యం అనే పేరు పోగొట్టుకొని పూర్తిగా జర్మనీ పైచేయి (సుప్రిమెసీ) కి లొంగిపోవడమా? ఛాంబర్లేను ధోరణి రెండవ దానికే లాగుతోంది.

## మునగాల రైతులకు

# ప్రకాశంగారిచ్చిన వాగ్దానం చెల్లించాలి

### ఆంధ్రరాష్ట్ర రైతు సంఘ తీర్మానాలు

5-7-39 వ తేదీన శ్రీ కొమ్మారెడ్డి సత్యనారాయణమూర్తిగారి అధ్యక్షతను జరిగిన ఆంధ్రరాష్ట్రి రైతుసంఘ సాధారణ సమావేశములో యీక్రింది తీర్మానములు గావించబడెను.

**మునగాల సత్యాగ్రహము**

13-6-39 తేదీన కార్యవర్గము మునగాల రైతుల సత్యాగ్రహము విషయములో ప్రభుత్వమునకు రైతుల కోర్కెలను తెలియపర్చుటకుగాను నియమించిన రాయబార వర్గమువారికి రెవిన్యూ మంత్రిగారిచ్చిన వాగ్దానముపై మునగాల రైతుసంఘమువారిచేత సత్యాగ్రహమును విరమింపచేసిన రాయబారవర్గము వారి చర్యను యీ సంఘమువారు ఆమోదించుచున్నారు.

10 రోజులలోపల మునగాల సత్యాగ్రహ ఖైదీలను విడుదల చేయుదుమనియు, విత్తనములు వగైరా అక్రమముగా జప్తుచేయబడ్డ ఆస్తులను తిరిగి రైతులకు యిప్పించెదమనియు, రివిన్యూ మంత్రిగారు వాగ్దానమిచ్చినను శ్రీ యెర్నేని సుబ్రహ్మణ్యంగార్ని ఒడంబడికను అమలు జరిపించుటకు మధ్యవర్తిగా నియమించుటవల్ల రైతుల తరఫున ఒడంబడికను అమలు జరిపించుటకుగాని, దాదాపు రు 2000/- శిస్తునుచెల్లించినను, సత్యాగ్రహమును పూర్తిగ విరమింపచేసినను, యింతవరకు ఖైదీలను విడుదలచేయుటగాని, జరిగియుండక పోవుట చాల విచారకరము. ఇప్పుడైననూ ప్రభుత్వము వెంటనే రివిన్యూ మంత్రిగారి వాగ్దానమును చెల్లించవలసినదిగా ప్రభుత్వమును యీ సంఘమువారు కోరుచున్నారు.

ఒడంబడికకు సంబంధించిన సివిల్, రివెన్యూ క్రిమినల్ కేసులను అమలు జరుగకుండా ఆపుదల చేయవలసినదిగా యీ సంఘంవారు ప్రభుత్వమును కోరుచున్నారు.

**నజరాణాల వసూలు**

ఉభయగోదావరి జిల్లాలలోను, గుంటూరు జిల్లాలోని పెదవడ్లపూడి కాల్వక్రింద అప్పాపురం ప్రాజెక్టు తదితర ప్రాంతపు నూతన మాగాణి భూములపైన వేయ నిర్ణయించిన నజరానా మొత్తమును చెల్లించవలసిన రైతులు మొత్తముమీద కడుబీదలు గనుక దాన్ని రద్దు చేయుట న్యాయమని తలంచుచు, కృష్ణాజిల్లాలో, ఈలాంటి నజరాణాలకు వాయిదావేసియూ, నూతనంగా భూమిని మాగాణిగా మార్చుటకై అమిత శ్రమపడుచున్న రైతులనుండి ఈ నజరానా వసూళ్ళను సాగించుచుండుట అన్యాయమని తీర్మానించుచూ, సదరు నజరాణా వసూళ్లను వెంటనే వాయిదా వేయించవలసిందని ప్రభుత్వమును కోరుచున్నారు.

**వెంకటగిరి రైతులకు రిమీషన్**

కామ్రేడ్ జి. సి. కొండయ్య, కామ్రేడ్ వి. శంకరయ్యగార్లు యిచ్చిన నివేదికను, శ్రీ చీక్ష్మ గురునాధంగారి అధ్యక్షతను జూన్ 25 వ తేదీన వెంకటగిరిలో జరిగిన సభా తీర్మానములను గమనించిన పిమ్మట, వెంకటగిరి యస్టేటులోని మాగాణి భూములలో పంటలన్నీ పూర్తిగా పాడైపోయినట్లు తెలియుచున్నది. అట్టి అశక్తులైన రైతులు తమ మెట్టభూములపై శిస్తులను పూర్తిగా చెల్లించి యున్నను, వారినుండి యిప్పుడు మాగాణి శిస్తులో రూపాయకు అర్ధరూపాయ వంతుననే శిస్తు రిమీషను అనడం, పైగా ముందుగా పూర్తి శిస్తును అక్రమజప్తుల ద్వారా వసూలు చేయడం, మొదలగు యస్టేటువారి చర్యలను యీ సంఘమువారు నిరసించుచు యస్టేటు రైతులు కోరినట్లు శిస్తునంతను పూర్తిగా రిమిషన్ యిప్పించునట్లు ప్రభుత్వం చూడవలసినదిగా యీ సంఘంవారు కోరుచున్నారు.

**కాశీపట్టణ సత్యాగ్రహ నాయకులమీద డిసిప్లినరీ చర్య.**

కాశీపట్టణ సత్యాగ్రహములో పాల్గొనిన కాంగ్రెసు రైతు సేవకులపై రాష్ట్రీకాంగ్రెసు కమిటి డిసిప్లినరీ చర్య తీసుకోడానికి సంజాయిషీ కోరియున్నది. వారొసగిన సంజాయిషీని గమనించి వారిపై ఎట్టి చర్య తీసుకోవలదని రాష్ట్రీకాంగ్రెసు కమిటిని ఈకమిటీవారు కోరుచున్నారు. (రాష్ట్ర కాంగ్రెసు వర్కింగ్ కమిటీ దరిమిలాను సమావేశమై, ఎట్టిచర్య తీసుకొనవద్దని తీర్మానించింది.)

కాశీపట్టణం రైతులు తమ సక్రమహక్కుల కొరకై సత్యాగ్రహమొనర్చి అనేక నిర్బంధములకు పాల్పడినారు. తుదకు రాష్ట్రీకాంగ్రెసు సంఘమువారి యొక్కయు, రివిన్యూ మంత్రి గారియొక్కయు, సలహాల ననుసరించి సత్యాగ్రహము నాపుదలచేసి ప్రభుత్వముచే నియమింపబడిన విచారణలో పాల్గొన్నారు. విచారణ ముగిసిపోయినదిగాన కాంగ్రెసు ప్రభుత్వము వెంటనే రైతుల సక్రమహక్కులను కాపాడుచు నిర్ణయించ గోరుచున్నాము.

**ఆంధ్రరాష్ట్రి రైతు మహాసభ.**

రాయలసీమలో జరుగనున్న రాష్ట్రి రైతు మహాసభకు ప్రదేశము, తేదీలు నిర్ణయించుటకు సంఘ అధ్యక్ష కార్యదర్శులకు అధికారమివ్వడమైనది.

**జూలై 9 వ తేదీ అసమ్మతి సభలు.**

ఏ కాంగ్రెసు సభ్యుడున్నూ రాష్ట్ర కాంగ్రెసు అనుమతి లేనిది సత్యాగ్రహములో గాని సమ్మెలోగాని పాల్గొనరాదని నిషేధించుతూ బొంబాయిలో జరిగిన అఖిలభారత కాంగ్రెసు సంఘము గావించిన తీర్మానము యెడల యీ సంఘమువారు విచారము వెలిబుచ్చుచున్నారు. రైతులు తమ కష్టాలను మాపుకొనటకుగాను గావించే సత్యాగ్రహ హక్కుకున్నూ, కాంగ్రెసు యొక్క ముఖ్యోద్దేశములకునూ యీ తీర్మానము వ్యతిరేకమనే ఈ కమిటీవారి అభిప్రాయము. అదీకాక యీ నిషేధమువల్ల రైతులు యెంతవరకు అవకాశముండునో అంతవరకు కాంగ్రెసుయొక్కయు, కాంగ్రెసువారి యొక్కయు సలహా, సహాయము తోడ్పాటులు పొందకుండా చేయుచున్నది. అందువలన రైతుసంఘాలను ప్రోత్సహించుట, గుర్తించుట అనే కాంగ్రెసుయొక్క ముఖ్యమైన ఉద్దేశ్యమునకే వ్యతిరేకముగా పోవుచున్నది.

ఈ విధమైన నిరంకుశ తీర్మానముచేయుట వలన అఖిలభారత కాంగ్రెసు సంఘం రైతు ఉద్యమాన్ని, రైతు పోరాటములను బలహీనమొనర్చుచున్నదనియు తర్వాత బ్రిటిషు ప్రభుత్వమునకు వ్యతిరేకమైన జాతీయ పోరాటమును క్షీణింపచేసి కాంగ్రెసుయొక్క ప్రతిష్ఠను, శక్తిని నిర్మూలముచేయుచున్నదనియు యీ కమిటీవారి నిశ్చిత అభిప్రాయము. అందుచేత ఈ తీర్మానమును సాధ్యమైనంత త్వరలో వుపసంహరించుకొనవలసినదిగా కాంగ్రెసు వర్కింగు కమిటీవారిని కోరుచున్నారు. ఈ లోపుగ రాష్ట్ర కాంగ్రెసు సంఘమువారు యెవరిమీదను డిసిప్లినరీ చర్యలు గైకొనకూడదని కోరుచున్నాము. కాంగ్రెస్ సంఘాలు కాంగ్రెసుమంత్రులను బహిరంగముగా విమర్శించకూడదనే అ॥ భా॥ కాం॥ సంఘముచేసిన మరియొక తీర్మానము వలన రాష్ట్రి కాంగ్రెసు సంఘం అనుమతి లేనిది ఏ సత్యాగ్రహము ఏ కాంగ్రెసువాది చేయరాదనే తీర్మానముయొక్క తోడ్పాటుతో ఇదివరకే తగిన ఫెడరేషను ప్రతికూల ప్రచారము చేయనట్టియు కాంగ్రెసు ఎన్నికల వాగ్దానములను సరిగా నెరవేర్చకుండిన కాంగ్రెసు మంత్రులకు మరింత నిరంకుశ అధికారమివ్వటమేనని యీ కమిటీవారు అభిప్రాయపడుచూ, యీ రెండు తీర్మానములయెడల అసమ్మతి వెలిబుచ్చుటకు గాను జూలై 9 వ తేదీన ఆంధ్రదేశ మందెల్లడల రైతులు అసమ్మతి సభలు, వూరేగింపులు చేయవలసినదిగా యీ కమిటీవారు హెచ్చరించుచున్నారు.

## గుడిమూల భూస్వామి దారుణాలు

**కామ్రేడ్ దామిశెట్టి పార్థసారధి**

గుడిమూల తూర్పు గోదావరిజిల్లాలో రాజోలుకు 10 మైళ్ళలో నున్న గ్రామము. ఈ గ్రామంలో శ్రీ కృతకృత్య రామేశ్వరస్వామికి 1950 యకరాల యస్టేట్ వుంది. ప్రారంభంలో యీ భూమి యే విధంగానూ సాగుకు పనికి వచ్చేదికాదు. అందుచేత దేవాలయ అర్చకునికి ఏవిధమైన లాభమున్నూ లేదు. భూమి పూర్తిగా గయాళు, నెలయేళ్లు, అడవి కావడంవల్ల నిరాశతో యెవరున్నూ సాగుచేయ ప్రయత్నించనే లేదు. తరువాత కొందరు అద్దాలపాలెం, గుడిమూల, రామేశ్వరం, సఖినేటిపల్లి వగైరా గ్రామాల్లోని రైతులు తాత్కాలికముగా ఏ విధమైన శిస్తులు లేకుండా భూమిని సాగుకు తెచ్చే పద్ధతిని (యి. 1కి 0-4-0) కౌలుకు తీసుకొన్నారు. క్రమంగా రైతులు విశేష శ్రమపడి, అడవులుకొట్టి, ఎత్తుపల్లాలు సమంచేసి, నీటి వసర్లు ఏర్పరచి చక్కగా ఫలించేలా చేశారు. తరువాత కాలువ యేర్పడి మురుగు నీటివల్ల సాగు జరిగేది. రైతులు పన్నులు తామే చెల్లించుకొని అర్చకులకు నిర్ణీత శిస్తు యిస్తూండే వారు. కొన్నాళ్లకు 1100 యకరాల భూమి శ్రీ రుద్రరాజు పద్మరాజుగారికి కౌలురీత్యా దఖలుపడింది.

**భూస్వామి అత్యాచారం.**

ఈ భూస్వామి అర్చకులకు యిచ్చిన స్వల్ప బాకీలకుగాను రైతుల శిస్తును విలియా పొంది అప్పటినుంచి క్రమంగా వసూలు చేసుకుంటున్నాడు. శిస్తులు గత పంటవరకూ సక్రమంగానే ఎట్టి పేచీలు లేకుండ వసూలగుచూ ఉన్నవి. అయినా 1908 మద్రాస్ యెస్టేటు ల్యాండు యాక్టు ననుసరించి తాను యెస్టేట్ దారునయితిననిన్నీ, ప్రకాశం రిపోర్టు లోపాయకారీ రైతులకు హక్కు లిచ్చుననిన్నీ కౌలుదార్ల కనీసపు కోర్కెలు నెరవేర్చుననీ వెర్రి భ్రమ కల్పించి అకస్మాత్తుగా 27 గురు రైతులను తొలగించి, అక్రమంగా 500 సిబ్బందితో కత్తులు, కటార్లతో 99 యకరాల భూమిలో సిద్ధముగానున్న పంటను కోసి నూర్చి ధాన్యము, పూర్వపుగడ్డిని, తీసికొనిపోయి పశువులను మోది, రైతులను హింసించి, పాకతీకించి, తగులబెట్టి ఎన్నో విధాల బాధలు పెట్టేరు.

**రైతుల దురవస్థలు**

భూ స్వామి, రైతులమధ్య పొత్తు కుదరనివ్వక పరస్పర ద్వేషాలు పెంచి, తన మాయ నాటకం సాగించుకొంటున్నాడు. రైతులకు నాములకు పెట్టుబడులు యిచ్చి, క్రమమైన లెక్కలు లేకుండా వారి పంటను యావత్తును తన బాకీక్రిందనే కొలుచుకొనుట రివాజు. కాలువలు, బోదెలు రైతులే త్రవ్వాలి. తమ స్వంత పశువులతో భూ స్వామికి అరకలు కట్టాలి. మురుగు బోదెకు కట్టలు కట్టి చేపలు పాటకు యివ్వడంవల్ల దిగువకు నీరు పోదువక రైతులెంతో బాధననుభవిస్తున్నారు. 2, 3, పాళ్ల ప్రకారం సేవ్యం సేసిన పంటలు కొలుచుకొనుటలో అనుమానాలాపాదించి, జుల్మానాలు వేసి నోట్లు వ్రాయించడంవల్ల ఆయా రైతులు శాశ్వతబానిసలే. ఒక రైతు 4 యకరాలు సాగుచేసి 25 బస్తాలు పండించగా, పూర్తిగా భూస్వామి దఖలు పరచుకొన్నాడు. ఇల్లాంటి అన్యాయాలెన్నో జరుగుచున్నా, అధికారవర్గము రైతులకు సహాయము చేయకపోవడమే కాకుండా కొందరిని అరెస్టుచేసేరు.

**రైతుసంఘ నిర్మాణము**

భూస్వామియొక్క అత్యాచారాలు సహించలేక చివరకు రైతులంతా సంఘముగా యేర్పడి 27 వ తేదీనుంచి జయజయధ్వానాలతో, స్వాతంత్ర్య నినాదాలతో భూస్వామి దౌర్జన్యాలను ఏకరువుపెట్టుచూ టేకిశెట్టిపాలెం, అద్దాలపాలెం గుడిమూల, అంతర్వేదిపాలెం, సఖినేటిపల్లి గ్రామాల్లోనూ, చుట్టుపట్లా, తమకు జరిగిన అన్యాయమును బయటపెట్టుచూ భూస్వామి దౌర్జన్యము నెదుర్కొనుటకు తగిన కార్యక్రమము నేర్పరచుకొనిరి.

28-6-39 వ తేదీ రాత్రి అద్దాలపాలెంలో సమావేశమైన గుడిమూల రైతులంతా పోరాట కార్యక్రమమునకై ఒక [illegible] కార్యవర్గము నెన్నుకొనిరి. కార్యవర్గమునకు శ్రీ పిరా రామమూర్తిగారు అధ్యక్షులు, కామ్రేడ్ అల్లూరి సోమరాజు కార్యదర్శి, మరి 9 మంది కార్యవర్గ సభ్యులు.



**ఏజన్సీ పరిపాలన పద్ధతి రద్దుకావాలి.**

అప్పర్ గోదావరి ఏజన్సీ మహాసభ 27-6-39 వ తేదీని భద్రాచలంలో శ్రీ పుసులూరి కోదండరామయ్యగారి అధ్యక్షతను జయప్రదంగా జరిగెను. శ్రీ చింతలచెర్వు వెంకటాద్రిగారు జాతీయ పతాకమును ప్రతిష్ఠించిరి. మహాసభలో యీక్రింది తీర్మానములు ఏకగ్రీవముగా ఆమోదించబడెను:

**తీర్మానములు**

1. ఒరిస్సా, బొంబాయి, బీహారు, అస్సాం మున్నగురాష్ట్రీ శాసనసభలలో 1935 వ సంవత్సరం ఇండియాఆక్టు 91 వ శక్షను ప్రకారం యేర్పరుపబడిన మినహాయింపు, అసంపూర్తి మినహాయింపు ప్రదేశములు వుండరాదని తీర్మానములు కావింపబడి చాలా కాలమైనప్పటికి యీప్రాంత ప్రజలు సభలద్వారాను, మహజర్ల ద్వారాను మదరాసు మంత్రివర్గంవారికి పరిపాలన ప్రారంభించినప్పటినుండియు విన్నవించుకొనియున్నను, ఇంతవరకు మంత్రివర్గంవారు యీరాష్ట్రింలోగల అసంపూర్తి మినహాయింపు ప్రదేశముల విషయములో తమ అభిప్రాయమును వెలిబుచ్చకపోవుటచే ప్రజలు చాల అసంతృప్తి చెందుచు, యికనైనను వెంటనే ఈ అసంపూర్తి మినహాయింపు ప్రదేశముల పరిపాలన రద్దుఅయి ఈప్రదేశములు సంపూర్ణముగా మంత్రుల పరిపాలనకు వచ్చుటకు కృషిచేయుట అవసరమని ఈసభవారు తీర్మానించుచున్నారు.

2. ఏజన్సీ జిల్లాబోర్డుకు నామినేషన్‌పద్ధతి రద్దుపరచి ఎన్నికల విధానము వెంటనే ఏర్పాటు చేయుటకు ఈసభవారు తీర్మానించుచున్నారు.

ఈ యేజన్సీ జిల్లాబోర్డులో ఖాళీఅయిన నాల్గు స్థానములు పూర్తిచేయుటలో గవర్నమెంటువారు అవలంబించిన విధానము నెడల యీ సభవారు తమ అసంతృప్తిని వెలిపుచ్చుచు ఈవిధానము ఏజన్సీ ప్రజల అభివృద్ధికి భంగకరమని తీర్మానించుచున్నారు.

3. ఈ ప్రాంతములలో చాలాగ్రామములకు తగినంత అన్‌రిజర్వు ఫారెస్టు లేకపోవుటచే రైతులకు ప్రజలకు చాలా యిబ్బంది కలుగుతూ వున్నది. గాన ప్రతిగ్రామమునకు తగినంత అన్‌రిజర్వు ఏర్పాటుచేయించుటవసరమని ఈ సభవారు ప్రభుత్వమువారిని కోరుచున్నారు.

4. నూగూరు తాలూకాలో ప్రతి సంవత్సరం యిచ్చే టకవీలోన్సు రైతుల కున్నంత వరకూ ఇచ్చియుండని కారణముచే బీదరైతులు వ్యవసాయపు తరుణము ఆసన్నమై చాలా యిబ్బందిపడుచున్నారు. వెంటనే పైలోన్సు వ్యవసాయదారులకు యిచ్చే యేర్పాటు చేయించుటకు గాను ప్రభుత్వమువారిని యీ సభవారు కోరుచున్నారు.

5. పరపతి సంఘముద్వారాను వ్యవసాయాభివృద్ధి సంఘములద్వారాను ఈ ప్రాంతమున గల వ్యవసాయ చేతిపనులు వగైరా విషయముల యందు ప్రజలు విశేషముగా అభివృద్ధికి వచ్చుటకుగాను తగు విధానము గవర్నమెంటు వారు యేర్పాటుచేయించవలెను.

6. ఈ ప్రాంతములో క్రయవిక్రయములందు ప్రజలకు చాల అక్రమము జరుగుచున్నవి గాన క్రయవిక్రయ పరపతి సంఘములు ప్రభుత్వమే యేర్పాటు చేయవలెను.

7. భూములులేని కోయప్రజలకు భూములు యిప్పించి వ్యవసాయమునకు పై కావలవారు అలవరుచుకుగాను తగు ఏర్పాట్లుగావించవలెను.

# రైతులోకం

8. రాజమహేంద్రవరమునుండి భద్రాచలమునకు మోటారు సర్వీసు యేర్పడే రోడ్డు సౌకర్యం సాధ్యమైనంత త్వరలో యేర్పరచుటకు ప్రత్యేక గ్రాంటు యివ్వవలెనని కోరడమైనది.

9. భద్రాచలం రోడ్డునుండి భద్రాచలం వచ్చు ప్రయాణీకులకు కష్టమ్మువారిచే గలుగు యిబ్బందులను తొలగించుటకు మదరాసు ప్రభుత్వమువారు హైదరాబాదు పొలిటికల్ యేజంటు గారికి వ్రాయ ప్రార్థించుచున్నారు.

9. శ్రీరామనవమికి భద్రాచలం యాత్రికులకు జబ్బులు కలుగకుండ ఆరోగ్య వసతికి యెక్కువ గ్రాంటు దయచేయించవలెనని మద్రాసు ప్రభుత్వమువారిని కోరుచున్నారు.

★ ★ ★

**నందిగామ రైతుల యిబ్బందులు తీరేటట్టు లేవు.**

నందిగామ తాలూకా రైతుసంఘ కార్యదర్శి యేజెళ్ల వెంకటసుబ్బయ్యగా రిట్లు వ్రాయుచున్నారు:—

నీటి దరఖాస్తులు పెట్టుకొనుటకు గడువును జూన్ నెలాఖరువరకు హెచ్చించుచు కృష్ణా జిల్లా కలెక్టరుగారు 15-6-39 తేదీన యిచ్చిన ఆర్డరు 27-6-39 తేదీ సాయంత్రం నాకు నందిగామ తాలూకా ఆఫీసులో యివ్వబడెను. దరఖాస్తులకు యిక 3 రోజులు మాత్రమే వ్యవధి. 28 వ తేది వర్కర్సును పిలుచుకోవడములోనే సరిపోయింది. గడువు చాలదని, మరల యొక నెల గడువు యివ్వమని జిల్లా అధికార్లకు వ్రాసితిని. తర్వాత బెజవాడలో కలసిన సోదరులు నేను చర్చించుకొని, కష్టమైనను వ్యవహారము నిర్వహించు కోవాలనుకుంటిమి. కరపత్రాలు అచ్చు వేయించుకొంటిమి. తీరా, తాలూకా ఆఫీసుకు వెళ్లి ఫారములు యివ్వవలసినదిగా హెడ్ గుమాస్తాగారిని కోరితే ఏ సంఘమైనప్పటికీ మొత్తంగా ఫారములు యిచ్చుటకు వీలు లేదనిరి. పరిస్థితులు వివరంగా నివేదించినను వారి పట్టుదల వీడరైరి. చివరకు దరఖాస్తువ్రాసి ఇవ్వమని చెప్పితిని. గ్రామాధికార్లకు ఫారములకు డబ్బు యివ్వవలసివస్తుందని ఇట్లు అడుగుతున్నారా అని యీసడించిరి. దరఖాస్తు వ్రాసియిస్తే పుచ్చుకొనుటకు కూడా నిరాకరించిరి. పూర్వము కృష్ణాజిల్లా కలెక్టరుగారిని జిల్లా రైతు సంఘం వీరు రైతు సంఘములకు చాలినన్ని ఫారములు సప్లయి చేయవలసినదిగా కోరియుండగా అన్ని తాలూకాలకు సర్క్యులరు జారీచేసి యుండిరి. ఆ విషయం జ్ఞాపకం చేసినను, వారు వినలేదు. వారి దృష్టి గ్రామాధికారులకు వచ్చే రాబడి పోతుందని యున్నది రైతులకు యి. 1కి రు 80-0-0 లు పైగా అదరాదపు శిస్తులు పడుచున్నవని చింతలేదు. కాంగ్రెసు మంత్రులు అరిస్తున్న పరివర్తనము ఉద్యోగుల వద్ద ఎలా పరిణమిస్తున్నదో ప్రజలు కాంగ్రెసు సంఘాలు గుర్తించి తగిన ప్రతిక్రియను ఆలోచించడం మంచిది.

★ ★ ★

**రైతు — కూలీల సామరస్యం**

5—7—39 తేది వుదయం 8 గంటలకు కోవూరు తాలూకా రైతుసంఘ వార్షిక సభ యిందుపూరులో నూకలపాటి శంకరయ్యగారి మేడమీద బి. శేషయ్యగారిఅధ్యక్షతను సమావేశమై ఈ క్రింది తీర్మానములు గావించడమైనది.

కోవూరు తాలూకా యినాం గ్రామాదులలో రైతులకున్న యిబ్బందులు అడవులువున్న గ్రామాల యిబ్బందులు, నాన్‌దెబ్బాల యిబ్బందులు, లంచాలు, యేప్రదేశాలలో ఎట్టి యిబ్బంది పెట్టి యేయేవుద్యోగస్తులు తీసుకును చున్నారు పైవిషయములన్నియు సమగ్రముగా తెలుసుకుని నెలరోజుల లోపల రిపోర్టు చేయవలసినదిగా యీక్రిందివారిని నియమించడమైనది.

బి. శేషయ్య, భవనం ధర్మారెడ్డి, నూకలపాటి శంకరయ్య.

తరువాత నూతన కార్యనిర్వాహక వర్గమును ఎన్నుకోవడమైనది.

బి. శేషయ్య అధ్యక్షుడు, యన్. శంకరయ్య కార్యదర్శి.

**తీర్మానాలు**

1. రైతుల హక్కులకోసం జరిపే పోరాటం జయప్రదం కావలెనన్న, స్వాతంత్ర్యపోరాటము అభివృద్ధి చెందవలెనన్న, రైతులు, వ్యవసాయకూలీలు సామరస్యముగా వుండవలెనుగాన వ్యవసాయ కూలీలకు యీ క్రింది జీతములకు తక్కువ లేకుండా యీ తాలూకాలోని రైతుల అందరిని యివ్వవలసినదిగా కోరడమైనది.

దిన కూలీలకు ముంతెడు మొలుగొలుకులకన్న తక్కువ లేకుండా యివ్వవలెను.

సేద్యగాండ్లకు నెల ఒకటింటికి 3౦ ముంతలు, సంవత్సరమునకు 1౦ తూములు; నెలకు రెండు రోజులు సెలవు; సగం పెట్టుబడివరకు వడ్డీగాని నాముగాని లేకుండా అప్పు యివ్వవలెను; జీతముగాని, పెట్టుబడిగాని గ్రామంలో పండిన వడ్లు ప్రపోర్షనల్‌గా యివ్వవలెను.

ఓవరు టైముకు ప్రత్యేక కూలి యివ్వవలెను.

ప్రభుత్వ ముద్రలేని పాత్రలను కూలిగాని మక్తాగాని కొలుచుటకు వుపయోగించరాదు; నాములిచ్చు పద్ధతి మానివేయవలెను. నిర్ధారణలేని వరుంబడి అయినటువంటివిన్నీ తగాదాలకు కారణమైనటువంటివిన్నీ కద్మెలు, దండకట్టు కళ్లాం, అను మామూళ్ళను వదలుకొని పైన తెలిపిన రేట్లకు తక్కువ లేకుండా ఖాయపు వరుంబడి ఏర్పాటుచేసుకొనవలెనని సేద్యమునకు కుదురు కూలీలను కోరడమైనది.

2. రాష్ట్రీకాంగ్రెసు అనుమతిలేనిదే ఏకాంగ్రెసువాది కూడా సత్యాగ్రహములో పాల్గొనకూడదని ఆల్‌యిండియా కాంగ్రెసు కమిటీ చేసిన తీర్మానము రైతులు కూలీలు తమ హక్కులకోసం జరుపు పోరాటములను బలహీనపరచుటయేగాక స్వాతంత్ర్య పోరాటమును తీరసిల్లోటని ఈసభ భావించుచూ ఆతీర్మానాన్ని పునరాలోచించి రద్దుచేసుకోవలసినదిగా కోరడమైనది.

3. "ఆంధ్రప్రభ" పత్రికా ప్రెస్ పనివాళ్లలో కొంతమందిని యజమానులు తీసివేసినందులకుగాను పనివాండ్లు చేయుచున్న సమ్మెపట్ల సానుభూతి చూపుచూ శాంతముగా పికెటింగు చేయుచున్న కార్మికులను నాయకులను అరెస్టుచేసిన ప్రభుత్వ తీవ్రచర్యలను ఖండించుచూ "జమీన్ రైతు" ప్రెస్‌లో పనిచేయు 3 గ్గురు కూలీలను "జమీన్‌రైతు" పత్రికా సంపాదకులు "ఆంధ్రప్రభ" కార్యాలయమునకు బ్లాకులెగ్సుగా పంపినందులకు అసమ్మతిని తెలియజేయుచూ ఆ 3 గ్గురు కూలీలను వెంటనే వెనుకకు పిలిపించవలసినదిగా "జమీన్‌రైతు" పత్రికాధిపతులైన శ్రీ నెల్లూరు వెంకట్రామానాయుడుగారిని కోరడమైనది.

4. వెంకటగిరి ఏస్టేటులో పండని పొలములకు శిస్తులు చెల్లించమని నిర్బంధపద్ధతులు అవలంబించుచున్న వెంకటగిరి ఎస్టేటువారి చర్యలను తీవ్రముగా ఖండించుచూ పండని పొలములకు పూర్తిరెమిషన్ యిప్పించవలసినదిగామద్రాసుమంత్రివర్గమును కోరుచున్నాము.

5. మునగాల రైతులకు జమీన్‌దారుకు మధ్య గొట్టిపాటి బ్రహ్మయ్యగారుచేసిన రాజీని అమలుపరచెదనని ప్రకాశంగారు యిచ్చిన హామీతో 15 రోజులవరకు రైతులు సత్యాగ్రహము నిల్పినందులకు ఆమోదిస్తూ వెంటనే రైతులకు న్యాయమైన హక్కులనన్నింటిని యిప్పించవలసినదిగా ప్రకాశంగారిని కోరుచున్నాము.

6. ఉప్పును తయారుచేయువారికి యింకొకజీవనాధారము లేనందున, కడు బీదలైనందున మోతమోసుకొని అమ్ముకొనే హక్కు వారికి వున్నదని వెంటనే ప్రకటించవలసినదిగా మద్రాసు మంత్రివర్గమును కోరడమైనది.

బి. శేషయ్య,
ప్రెసిడెంటు,
కోవూరుతాలూకా రైతుసంఘం.

★ ★ ★

**నజరానాలకు ఒక సంవత్సరం వాయిదా.**

తెనాలి తాలూకా కాంగ్రెస్ కార్యవర్గము 6-7-39 మధ్యాహ్నం 4 గంటలకు చదలవాడలో సజ్జా క్రిష్ణయ్యగారి ఇంట్లో చింతల సూర్యనారాయణగారి అధ్యక్షతను సమావేశమయి ఆమోదించెను. యీక్రింది తీర్మానములు

1. తాలూకాలో జరుగుచున్న లంచగొండితనమును గురించి కనుగొనుచూ, తగిన చర్యలను జరుపుటకు చింతల సూర్యనారాయణ, అవుతు సుబ్బారెడ్డి, డాక్టర్, పసుపులేటి క్రిష్ణమూర్తిగార్లను ఒక వుపసంఘముగా నియమించుచూ, పై వుపసంఘమునకు తాలూకాలో జరుగు లంచగొండి తనమునకు సంబంధించిన కేసులు ఎప్పటికప్పుడు తెలియ జేయుచుండుటకు ఆయా ఫిర్కాలలోని కారనిర్వాహక సభ్యులకు అధికార మివ్వటమైనది.

2. గ్రామసంఘాల జమాఖర్చులను పరిచూచుటకు (1) చిలుమూరి వెంకటపూర్ణానందరావు, (2) చుక్కపల్లి వెంకటసత్యనారాయణగార్లను, నియమించడ మైనది.

3. కొత్త మాగానులమీద వేయబడిన నజరానాలను ఆగష్టు 27 వ తేదీలోగా చెల్లించాలని జిల్లా కలెక్టరుగారు చేసిన ఉత్తరువులను నిరసించుచూ, ఈ నజరానాల వసూలును ఒక సంవత్సరం వరకు ఆపి వుంచవలసినదిగా మద్రాస్ మంత్రివర్గమువారిని ఈసభవారు కోరుచున్నారు.

ఇంకా కొన్ని తీర్మానములు చేయబడెను.

# కాంగ్రెస్ సభ్యత్వము - మన విధి

## సోషలిస్టు పార్టీ కార్యనిర్వాహకవర్గ తీర్మానాలు

ఆంధ్రరాష్ట్ర కాంగ్రెసు సోషలిస్టుపార్టీ కార్య నిర్వాహక వర్గం జులై 4, 5 తేదీలలో బెజవాడ పార్టీ ఆఫీసులో మద్దూరి చంద్రశేఖరరావు గారి అధ్యక్షతను సమావేశమై యీ క్రింది తీర్మానాలు ప్యాసు చేసింది.

1. కాంగ్రెసు నిర్మాణ విధానంలో గత ఎ. ఐ సి.సి గావించిన మార్పుల బట్టి పార్టీ సభ్యులు ఈ క్రింది విషయాలు గమనించాలి.

"(a) నియోజకవర్గాలు శాశ్వతముగా ఏర్పాటుచేయవలయునను నిర్ణయమును ఈ సంవత్సరమునుండియే రాష్ట్ర కాంగ్రెసు కమిటీ అమలుపరచవలయును.

(b) సభ్యులను రిజిస్టరు చేసి, సర్టిఫికేటులు తీసికొనాలి అనే నియమము అమలుపరచడానికి ప్రతి గ్రామములో రిజిస్టరు పెట్టవలయును. లేనిచో సభ్యులను ఎక్కువమందిని చేర్పించటము, తద్వారా కాంగ్రెసు బలమును పెంపొందింప జేయడము అసంభవమగుతుంది. గ్రామ కాంగ్రెసు సంఘములు లేనిచోట టూరింగు రిజిస్ట్రారులను ఏర్పాటు చేసి కాంగ్రెసు సభ్యులను రిజిస్టరు చేసి సర్టిఫికేటుల నివ్వవలయును."

పై రెండు తీర్మానాలు రాష్ట్రకాంగ్రెసు కమిటీలో పార్టీ సభ్యులచే ఉపపాదించబడునట్లు చూడవలయును.

3. ఈ సంవత్సరము సభ్యులనుగా చేర్పించనిదే రాబోవు సంవత్సర కాంగ్రెసు ఎన్నికలలో పాల్గొనడానికి కాంగ్రెసు సభ్యులకు హక్కు లేదు కాన పార్టీ సభ్యులు ప్రత్యేక కృషి గావించి సాధ్యమైనంత ఎక్కువ మందిని కాంగ్రెసులో సభ్యులనుగా చేర్పించాలి.

4. పార్టీసభ్యులు వారి వారి కాంగ్రెసు కమిటీల నుండి తాము గత మూడుసంవత్సరములుగ కాంగ్రెసు సభ్యులుగ ఉండినట్లు సర్టిఫికేటు తీసుకొనవలయును. ఆరకంగా సర్టిఫికేటు తీసుకొన్న పార్టీ సభ్యుల లిస్టు అగస్టు నెలాఖరులోపల జిల్లా పార్టీలు రాష్ట్ర పార్టీకి పంపించవలయును.

5. కాంగ్రెసు సభ్యులు రాష్ట్ర కాంగ్రెసు అనుమతి లేనిదే ఏ పరిస్థితులలోను సత్యాగ్రహము చేయగూడదని ఎ. ఐ. సి. సి తీర్మానించడము, కాంగ్రెసుసభ్యుల హక్కును భగ్నమొనర్చడమే గాక, రైతుల మధ్య, కార్మికుల మధ్య, ప్రజాసామాన్యము మధ్య వీరు సరిగా పని చేయనివ్వక అడ్డుపడుతూ, కాంగ్రెసు ఉద్యమానికే దెబ్బగొట్టుతూ ఉంది. ఇట్టి జాతీయ వ్యతిరేక తీర్మానాన్ని సాధ్యమైనంత త్వరలో రద్దు చేయునట్లు కాంగ్రెసు సభ్యులు, ప్రజాసామాన్యము పనిచేయాలి. ఈలోపల రాష్ట్ర కాంగ్రెసు కమిటీలు అట్టి సత్యాగ్రహ పోరాటాలలో పాల్గొన్న కాంగ్రెసు సభ్యులపై ఎట్టి చర్యకూడ తీసుకొనవలదని ఈకమిటీ కోరుతూఉంది.

6. మంత్రుల చర్యలను రాష్ట్ర కాంగ్రెసు కమిటీ బహిరంగంగా విమర్శించరాదనీ, మంత్రులేమిచేయాలనేదీ రాష్ట్ర కాంగ్రెసు కమిటీలు నిర్ణయించకూడదని అఖిల భారత కాంగ్రెసు కమిటీ తీర్మానము చేయడం, రాష్ట్ర కాంగ్రెసు కమిటీలను మంత్రులయొక్క అధీన సంఘములుగ చేయుచున్నది. అందుచే కాంగ్రెసుమంత్రులు, ఇప్పటికన్న ఎక్కువగా ప్రజా కోర్కెలను నిర్లక్ష్యించడానికి అవకాశ మేర్పడినది. ఈ తీర్మానమును రద్దుచేసి కాంగ్రెసు మంత్రులను రాష్ట్రకాంగ్రెసు సంఘాలు చెప్పిన రీతిని చేయునట్లు కాంగ్రెసుసభ్యులు, ప్రజాసామాన్యము పని చేయవలసినదిగా ఈ కమిటీ హెచ్చరించుచున్నది.

7. కాశీపట్టణ పోరాటములో పాల్గొన్నారని, ప్రోత్సహించారని పశ్చిమ గోదావరి రైతు సంఘ సోషలిస్టు పార్టీ సభ్యులను, 15 మంది కాంగ్రెసు సేవకులపై డిసిప్లినరీ చర్య తీసుకోడానికి రాష్ట్ర కాంగ్రెసు కమిటీ సంజాయిషీ కోరినందులకు ఈ కమిటీ విచారపడుతూ, స్వాతంత్ర్య పోరాటమునకు వారు గావించిన పని, బలము కల్గించినట్టిదియే కాబట్టి వారిపై ఎట్టి చర్యకూడ తీసుకొనవలదని కోరుతున్నారు.

8. కాంగ్రెసులో మితవాదనాయకులు, కాంగ్రెసు మంత్రివర్గాలు క్రమేణ స్వాతంత్ర్య పోరాటాన్ని వెనక్కినెట్టి కాన్స్టిట్యూషనల్ దృక్పథము వహిస్తూ ఉండడమువల్ల, రైతు, కార్మిక, ప్రజా సామాన్యము యొక్క హక్కులను కాపాడుతూ స్వాతంత్ర్య పోరాటాన్ని ముందుకు తీసికొని పోవుటకు బదులు, బ్రిటిష ప్రభుత్వోద్యోగులతో ఘర్షణ కలుగుతుందేమోనను భయముతో పనిచేస్తూ వున్నారు. ఈ పాలసీని వ్యతిరేకించి స్వాతంత్ర్య పోరాటాన్ని అభివృద్ధి చేయడానికి అతివాద పార్టీలన్నీ కలసి "అతివాద సమ్మిళిత సంఘము" (లెఫ్టు కన్సాలిడేషను కమిటీ) ను ఏర్పాటు చేశారు. ఇందు కమ్యూనిస్టులు, కాంగ్రెసు సోషలిస్టులు, ఫార్వర్డుబ్లాకు పార్టీవారు, రైతు సంఘ నాయకులు, రాయిస్టులు కలిసి ఉన్నారు. అందుచే అతివాద సమ్మిళిత సంఘ తీర్మానాలను, స్టేటుమెంటులను, పార్టీ తీర్మానాలుగను, స్టేటుమెంటులుగను భావించి సభ్యులందరూ ఆచరణలో పెట్టవలయును.

9. పార్టీ సభ్యులకు పని ఇచ్చి గత మూడుమాసాల చందా వసూలుచేసి ఈ నెలాఖరుకు సభ్యత్వ కార్డులు పంపాలి. కార్డులలో ఉన్న వివరములతో జిల్లా పార్టీ ఒక రిజిస్టరు, తాలూకా పార్టీలు ఒక రిజిస్టరు, స్థానిక పార్టీలు ఒక రిజిస్టరు, తయారుచేసి పెట్టుకోవాలి. అప్లికేషను ఫారములు, రాష్ట్ర పార్టీకి ఒక ఫారము జిల్లా పార్టీకి ఒక ఫారము ఉండాలి. సభ్యత్వ కార్డులు పార్టీ సభ్యులవద్ద ఉండాలి.

పార్టీ సభ్యుడు పార్టీ ఇచ్చిన పని చేస్తూ ఉండాలి. పార్టీ సభ్యత్వమును చెకింగు చేయునపుడు పార్టీలో కనీసము ఈ క్రింది పనులు చేయనివారిని పార్టీనుండి తొలిగించివేయవచ్చును.

1. పార్టి పత్రికను చదువుట.
2. పార్టి చందా చెల్లించుట.
3. పార్టి మీటింగులకు హాజరగుట.

★

### కాంగ్రెసులో చేరువారు, చేర్పించేవారు గమనించవలసిన విషయాలు.

కాంగ్రెసు నిబంధనలలో అఖిల భారత కాంగ్రెసు సంఘము చేసిన మార్పులననుసరించి కాంగ్రెసులో సభ్యులుగా చేరునపుడు గమనించవలసిన విషయాలను గురించి ఆంధ్రరాష్ట్ర కాంగ్రెసు సంఘము ఒకసర్క్యులర ప్రకటించింది. దీని ననుసరించి సభ్యులుగా చేరువారు నాలుగుఅణాలు చెల్లించుతూ, తమ దరఖాస్తులో సంతకము లేక నిశానిగుర్తుతోపాటు ఒక సాక్షి సంతకముకూడ చేయించాలి. దరఖాస్తుదారుని పూర్తి పేరు, తండ్రిపేరు, లేక వివాహితయగు స్త్రీ అయినచో భర్త పేరు కూడ నమోదు చేయవలెను. ఈ దరఖాస్తును స్వయముగా గాని, పోస్టుద్వారాగాని జిల్లా ఆఫీసుకు పంపవలెను.

ఈసంవత్సరము అగష్టు 31 వతేదీ లోపున చేరినవారే ఓటింగు హక్కును కలిగి వుందురు. అఖిల భారత కాంగ్రెసు కమిటీ చేసిన యింకొక నిబంధన ప్రకారము 1 సంవత్సరం పూర్తిగా సభ్యులుగా ఉన్నవారే ఓటింగు చేయుటకు అర్హులు అను సూచన మరుసటి సంవత్సరము అమలుకు వచ్చును. అంటే కాంగ్రెసులో చేరి కాంగ్రెసు మహాసభ రాజకీయ కార్యక్రమములో పాల్గొన గోరువారందరు అగష్టు 31 వ తేదీ లోపల కాంగ్రెసులో సభ్యులుగా నమోదు చేయించుకోవాలి. అపుడే వారికి ఓటింగు హక్కు వుంటుంది: కాంగ్రెసు ఎన్నికలలో పాల్గొన కల్గుతారు. లేనిచో రెండు సంవత్సరాలు రాజకీయ జీవితములో వెనుక పడిపోతారు.

తరువాత ముఖ్యంగా గమనించవలసిన యింకో నిబంధన వుంది. పావలా చెల్లించి పై విధంగా దరఖాస్తుపై సంతకం చేసిన తరువాత పొందిన రశీదును తీసికొని స్థానిక కాంగ్రెసు సంఘ కార్యాలయములో యిచ్చి ధృవ పత్రమును (దీనినే 'బి' ఫారం అంటారు) పొందాలి. ఇదివరకే కాంగ్రెసు సభ్యులైన వారు తమ సభ్యత్వాన్ని పునరుద్ధరించుకోడానికి స్థానిక కాంగ్రెసు సంఘ ఆఫీసుకువెళ్ళి సభ్యత్వ పునరుద్ధరణ నామోనాను పూర్తిచేసి 4 అణాలు చెల్లించవలెను. ఆఫీసువారు—ధృవ పత్రమును (బి. ఫారము) యిచ్చెదరు.

ఈ 'బి' ఫారమును కాంగ్రెసు సభ్యులందరు తమవద్ద భద్రంగా వుంచుకోవాలి. ఇదే కాంగ్రెసు సభ్యత్వాన్ని రుజువుపరచు ధృవ పత్రంగా వుంటుంది.

### సభ్యత్వపు పుస్తకాలు

జిల్లా సంఘము సభ్యత్వ పుస్తకాలు ప్రతియేటా అచ్చువేసి, అధ్యక్షుని లేక కార్యదర్శి సంతకపుముద్రతో అధీన సంఘములకు, వ్యక్తులకు అందచేయును.

సభ్యులుగా చేరదలచువారికి ఒక్కొక్క ఫారము యివ్వబడును.

పూర్తి చేయబడిన ఫారాలన్నీ అధీన సంఘాల ద్వారానే జిల్లా సంఘానికి చేరవలయును.

జిల్లాలోని ప్రతి నియోజకవర్గమునుండియు చేర్పబడిన శాశ్వత పట్టీ ప్రతి జిల్లా కాంగ్రెసు సంఘములో వుంచబడును. ప్రతి సంవత్సరము సభ్యుడు తిరిగి దరఖాస్తు చేసినదీ లేనిదీ, సభ్యత్వ రుసుము చెల్లించినదీ లేనిదీ యీ శాశ్వత పట్టీలో నమోదు చేయబడును.

ప్రతి జిల్లా కాంగ్రెసు సంఘము ఎన్నిక అర్హత గల ప్రాథమిక కాంగ్రెసు సభ్యుల పట్టీని తయారుచేసి నిర్ణయించిన తేదీలోపుగా రాష్ట్ర సంఘ ఆఫీసుకు పంపవలెను. గ్రామ, పట్టణ, తాలూకాల వారీగా సభ్యుల సంఖ్య తెలుపు స్టేటుమెంటునుకూడ పంపవలెను.

ఈ సభ్యుల పట్టీలో పేరుగలవారికే కాంగ్రెసు ఎన్నికలలో పాల్గొను హక్కు వుంటుంది.



# ఆర్థిక రాజకీయ పాఠశాలలు

## జమా ఖర్చుల వివరాలు

### మైపాడు ఆర్థిక రాజకీయ పాఠశాల

యీపాఠశాల మే 15 మొదలు జూన్ 14 వరకు మైపాడు గ్రామములో జరుపబడెను. యిందు విద్యార్థులు 34 గురు ఉండిరి. వీరు గాక పరిసర ప్రదేశములనుండి కొందరు అప్పుడప్పుడు విచ్చేసి యీపాఠశాలయందు విద్యాభ్యాసము చేయుచుండిరి. పాఠశాల ప్రధానోపాధ్యాయులు కామ్రేడ్ పుచ్చలపల్లె సుందరయ్య. ఉపాధ్యాయులు డన్‌కన్‌గ్రీనులను (కడలూరు) కామ్రేడ్ నారశింహారెడ్డి (మదనపల్లి) ప్రొఫెసరు యన్. జి. రంగా, కామ్రేడ్ డి బలరామిరెడ్డి ఉపన్యాసకులు యీపాఠశాల ప్రారంభోత్సవము మదరాసు క్రేడ్‌యూనియను ఉపాధ్యాయులగు శ్రీమతి దర్శి సుభద్రమ్మగారిచే జరుపబడెను. నాటిసభకు జిల్లా కాంగ్రెసు అధ్యక్షుడు శ్రీబెజ్జిపూడి వెంకటనారాయణరెడ్డిగారధ్యక్షత వహించిరి.

వాలంటీరు శిక్షణమిచ్చుటకు డాక్టరు పాలపల్లి రమణయ్యగారు వచ్చుటకు వీలులేనందున కొరపాటి పట్టాభి రామయ్యగారు (రాజమండ్రి) ఈకార్యమును నిర్వహించిరి.

జమలు

| | |
|---|---|
| చందాలు యిప్పటివరకు వసూలు | రు 481-0-0 |
| యింకను వసూలు కావలసిన వాగ్దానములు | రు 125-0-0 |
| విద్యార్థులవల్ల .... | రు 90-0-0 |
| | 696-0-0 |

ఖర్చులు

| | |
|---|---|
| భోజనములకు .... | రు 426-0-0 |
| బియ్యము | 82-0-0 |
| వంట, మొ॥ | 21-0-0 |
| కట్టెలు | 24-0-0 |
| నెయ్యి | 68-0-0 |
| కాఫీ | 25-0-0 |
| టీ | 20-0-0 |
| కూరలు, ఇతర సామానులు | 177-0-0 |
| | 426-0-0 |
| పోస్టు టెలిగ్రాము | రు 31-8-0 |
| ప్రయాణం ఖర్చులు | 76-0-0 |
| క్యాంపునిర్మాణము | 48-0-0 |
| పుస్తకములు, కాగితములు | 3-12-0 |
| ఉపన్యాసకులకు | 92-8-0 |
| దినకూలీలు | 24-0-0 |
| చాపలు | 10-0-0 |
| పడవ వుప్పుకాలవ దాటుటకు | 4-8-0 |
| ఫొటో | 6-0-0 |
| దినోత్సవం | 7-0-0 |
| | 746-3-0 |

అనేక వ్యయప్రయాసలకోర్చి, ఈపాఠశాలకు విచ్చేసి, యీకార్యక్రమము జయప్రదముగ నెరవేరుటకు మాకు తోడ్పడిన ఉపన్యాసకులకు విరాళముల నొసంగిన మాజిల్లా వాస్తవ్యులకు మాకృతజ్ఞత తెల్పుచున్నాము.

దువ్వూరు బలరామిరెడ్డి
వ్యవస్థాపకుడు,

★ ★ ★

### రైతాంగవిద్యాలయం, తునికిపాడు.

విద్యాలయం 25-5-39 నుండి 13-6-39 వరకు జరుపబడింది. 50 మంది విద్యార్థులు వచ్చారు; యిందులో 20 మంది విద్యార్థులకు ఉచితంగా భోజన సౌకర్యాలు కలుగజేయబడినవి. విద్యాలయమందలి నిత్యము జరుగు క్లాసులకు యితర గ్రామములనుండి వచ్చే దర్శకులకు, బహిరంగసభలకు వచ్చే ప్రజలకు అవసరాన్నిబట్టి విద్యాలయమునందే భోజన సౌకర్యాలు కలిగించబడినవి. మొత్తము మీద ఈ విద్యాలయానికి ఆర్థిక సహాయ మంతయు నిజాం రైతాంగము నుండియే లభించినదని చెప్పవచ్చును. కారణాంతరములచే విరాళము లిచ్చిన వ్యక్తులపేర్లు గ్రామముల పేర్లు ప్రకటించలేదు.



పామర్రు రాజకీయ పాఠశాలలో మిలటరీ కవాతు చేస్తున్న విద్యార్థులు

జమా - ఖర్చుల పట్టిక.

జమ

| | | | |
|---|---|---|---|
| చందాలు | 599 | 9 | 6 |
| విద్యార్థి రుసుము | 125 | 0 | 0 |
| మొత్తం | 724 | 9 | 6 |
| వాగ్దానాలు | 67 | 0 | 0 |

ఖర్చులు

| | | | |
|---|---|---|---|
| పాకలు, పందిళ్లు | 88 | 0 | 6 |
| హాస్టలు | 379 | 13 | 6 |
| ప్రయాణపు ఖర్చులు | 93 | 14 | 6 |
| పత్రికలు | 4 | 0 | 0 |
| ఉత్సవ, మీటింగు ఏర్పాటులు | | | |
| సాదరులు వగైరా | 53 | 7 | 3 |
| కూలి | 37 | 15 | 3 |
| స్టేషనరీ | 25 | 2 | 0 |
| అచ్చు | 20 | 12 | 0 |
| తపాలా | 29 | 9 | 0 |
| సామానులు | 13 | 7 | 9 |
| ఫొటో | 8 | 0 | 0 |
| | 754 | 1 | 9 |

ఇట్లు,
సుంకర వీరభద్రరావు,
ఆర్గనైజరు.

★ ★ ★

మేనెలలో ఇచ్ఛాపురంలో జరిగిన ఆర్థిక రాజకీయ వేసంగి పాఠశాలయొక్క జమా ఖర్చులు.

వసూళ్లు

| | |
|---|---|
| శ్రీ పుల్లెల శ్యామసుందరరావుగారు యం. ఎల్. ఎ. | 200-0-0 |
| శ్రీ వి. యల్. యస్. రాజుగారు యం. ఎల్. ఎ. విశాఖపట్టణం జిల్లాబోర్డుప్రెసిడెంటు | 25-0-0 |
| విజయనగరము టౌను | 51-0-0 |
| బారువ | 47-0-0 |
| చికాకోల్ టౌను | 40-0-0 |
| విద్యార్థులనుండి | 25-0-0 |
| కోరాపుట్, జయపూరు | 24-0-0 |
| చికాకోలు, నరసన్నపేట తాలూకాలు | 22-0-0 |
| భీమిలి | 16-0-6 |
| సోంపేట | 16-0-0 |
| బొబ్బిలి | 11-0-0 |
| పాతపట్టణం తాలూకా | 15-0-0 |
| తర్లాం ఎస్టేటు రైతుసంఘం | 30-0-0 |
| రంగూన్ హరిజనులు | 5-0-0 |
| | 527-0-0 |

ఖర్చులు

| | |
|---|---|
| భోజనము | 274-11-6 |
| ఉపన్యాసకుల ప్రయాణఖర్చులు చందాలు వసూళ్లు చేయుటకు ప్రయాణపు ఖర్చులు, బీదవిద్యార్థులకు ప్రయాణఖర్చులు | 218-2-0 |
| గ్రంథాలు | 8-10-0 |
| ప్రింటింగు, ఎడ్వరుటైజుమెంటు | 49-10-3 |
| పోస్టు అండ్ టెలిగ్రాప్ | 24-4-3 |
| | 575-6-0 |

| | |
|---|---|
| మొత్తం ఖర్చు | 575-6-0 |
| మొత్తం వసూళ్ళు | 527-0-6 |
| అప్పు | 48-5-6 |

విశాఖపట్టణం 3-7-39

ఇట్లు
జి. రామకోటేశ్వరావు,
ఆర్గనైజరు
ఆంధ్రరాష్ట్ర విద్యార్థి సంఘము.

★ ★ ★

### తూ॥ గో॥ రాజకీయ పాఠశాల.

రాజోలు తాలూకా కాంగ్రెస్ సోషలిస్టుపార్టీ వారి యాజమాన్యమున రాజోలు తాలూకా అంతర్వేదిపాలెం 16-6-39 నుంచి 30-6-39 ఆర్థిక రాజకీయపాఠశాల నిర్వహింపబడినది. పాఠశాలలో శ్రీ పుసులూరు కోదండరామయ్య గారు గత సత్యాగ్రహము, రానున్న పోరాటములనుగూర్చియు, కామ్రేడ్ పి. అనంతం ఫ్యాసిజం, ఫెడరేషను, జీవిత పరిణామము లనుగూర్చియు, కామ్రేడ్ పి. సూర్యనారాయణ కాంగ్రెస్ చరిత్రను గూర్చి, కామ్రేడ్ రామమోహన్ మాక్స్ ఉపదేశాలనుగూర్చి, కామ్రేడ్ పట్టాభిరామయ్య నిర్మాణ సమస్యలు, రైతు-కూలీ ఉద్యమములనుగూర్చి ఉపన్యసించిరి. కామ్రేడ్ పార్థసారధి పఠనబృంద తరగతులను తీసికొనిరి.

వ్యాయామ శిక్షణకై యీ పాఠశాలలో ప్రత్యేక శ్రద్ధ యివ్వబడినది. ప్రతిరోజూ ఉదయం 5-30 మొదలు 7 వరకు, సాయంత్రము 4-30 మొదలు 6 వరకు వ్యాయామ క్రీడలు జరిగినవి. సాధారణ డ్రిల్లు, మిలిటరీ డ్రిల్లు (తుపాకీలకు బదులు కర్రలు ఉపయోగింపబడినవి) పరుగెత్తుట, ఈత, సైకిలు త్రొక్కుట, ఎత్తు - దూరము దూకుట, హర్డిల్సుదూకుటవిరమిద్దు కట్టుట, కుస్తీ పట్టుట మొదలగు వ్యాయామ క్రీడలన్నిటిని విద్యార్థులు ఉత్సాహముతో నేర్చుకొనిరి.

29వ తేదీ మధ్యాహ్నం విద్యార్థులంతా సమావేశమై రాజకీయ విజ్ఞాన పరిషత్తుకు కామ్రేడ్స్ సి. వి. కృష్ణారావును కార్యదర్శిగాను, శ్రీ పుసులూరి కోదండరామయ్య, పా. సత్యనారాయణ శర్మ, పు. సత్యనారాయణ, ఆర్. వి. జగ్గారావులను కార్యవర్గ సభ్యులుగాను ఎన్నుకొనిరి.

ఆదాయ వ్యయపట్టిక

ఆదాయము

| | |
|---|---|
| విద్యార్థి రుసుము | 1-0-0 |
| వసూలైన విరాళములరొక్కంల | 54-0-0 |
| వస్తురూపమున వచ్చిన విరాళముల విలువ | 5-0-0 |
| వాగ్దానములుచేసిన బాపతు, విరాళములు రావలసినవి | 15-0-0 |
| బదులుతెచ్చినవి | 8-0-0 |
| మొత్తం | 83-0-0 |

వ్యయము

| | |
|---|---|
| భోజనసామగ్రి | 43-8-0 |
| పోస్టేజీ | 3-10-0 |
| స్టేషనరీ | 4-9-0 |
| పనివాళ్ళ జీతాలు | 5-7-0 |
| ప్రయాణపు ఖర్చులు, సైకిలు అద్దెలు | 11-8-0 |
| ప్రింటింగు చార్జీలు | 3-0-0 |
| ఇతర ఖర్చులు | 3-1-0 |
| చెల్లించవలసిన బాకీలు | 8-0-0 |
| నిలవ | 0-4-0 |
| మొత్తం | 83-0-0 |

అంతర్వేదిపాలెం 1 జూలై, 39

నంబూరి శ్రీనివాసరావు
కార్యదర్శి

# కాంగ్రెసు వార్తలు

### తెనాలి తాలూకాలో
### ఫెడరేషన్, యుద్ధప్రతికూల ప్రచారం.

ము త్తేవి మాధవచారిగారిట్లు వ్రాయుచున్నారు.

గుంటూరుజిల్లా కాంగ్రెస్ సంఘమువారు జిల్లాలో ఫెడరేషన్, యుద్ధప్రతికూల ప్రచారము గావించుటకు కామ్రేడ్ వావిలాల గోపాలకృష్ణయ్య గారిని ఆనరరీ ఆర్గనైజర్‌గా నియమించారు. వారి కార్యక్రమ ప్రకారం తెనాలి తాలూకాలో 20-6-39 నుంచి 26-6-39 వరకు ఫిర్కాకు ఒకరోజు చొప్పున తాలూకా కాంగ్రెస్ సంఘమువారు సంచార కార్యక్రమమును ఏర్పాటుచేసిరి. గోపాలకృష్ణయ్యగారితోపాటు గుంటూరుజిల్లా కాంగ్రెస్ సోషలిస్టుపార్టీ కార్యదర్శి కామ్రేడ్ వి. వి. శివయ్య, తెనాలి తాలూకా కాంగ్రెస్ సంఘాధ్యక్షులు కామ్రేడ్ చింతల సూర్యనారాయణ, నేనూకూడ సంచారము చేసితిమి. ఈ 7 రోజులలోను 104 మైళ్ళు ప్రయాణముచేసి, 7 గ్రామములలో ఫిర్కాసభలను, 4 గ్రామములలో సాధారణ సభలను జరిపితిమి. 4200 మంది ప్రజలు మొత్తం సభలలో పాల్గొనిరి. ప్రతి గ్రామములోను ఆంధ్రరాష్ట్రీ కాంగ్రెస్ సంఘమువారు ప్రకటించిన "జమీందారీ కమిటీ రిపోర్టు"ను, "ఫెడరేషన్ నిజస్వరూపము"లను అమ్మితిమి. మొత్తం 25 "రిపోర్టుల"ను, 60 "ఫెడరేషన్ నిజస్వరూపము"లను అమ్మితిమి. కొన్ని గ్రామములలో "నవశక్తి"కి విరాళములు, చందాలు వసూలుచేసితిమి.

ఈ తాలూకాలో 8 మంది పి. సి. సి. సభ్యులు, 66 మంది డి. సి. సి. సభ్యులు, 6 గురు జిల్లాబోర్డు కాంగ్రెస్ సభ్యులు వున్నప్పటికీ ఏ 8, 10 మందో తప్ప మిగిలిన వారెవ్వరూ ఈకార్యక్రమమును యింకా జయప్రదంగా సాగించుటకు పూనుకొనకపోవుట, కనీసం వారి వారి ఫిర్కాలలో జరుగు సభలకైనా హాజరు కాకపోవుట విచారకరము.

పేరుకి ఫిర్కాసభలని జరిగినవేకాని తెనాలి, దుగ్గిరాల ఫిర్కాల సభలలోతప్ప మిగిలిన ఫిర్కాసభలలో ఇతర గ్రామములనుంచి ప్రాతినిధ్యమేలేదు. ఆయినప్పటికి కూచిపూడి, చేబ్రోలు గ్రామములలో జరిగిన ఫిర్కాసభలలో తప్ప మిగిలినచోట్ల ప్రజలు సభలలో ఎక్కువమంది పాల్గొన్నారు. నందివెలుగులో జరిగిన తెనాలి ఫిర్కాసభలో వర్షము, బురదగా వున్నప్పటికీ, కంచర్లపాలెం, ఎరుకలపూడి గ్రామములనుంచి సభకు వచ్చారు. దాదాపు 3 వందలమంది సభలో పాల్గొన్నారు. మొత్తంమీద ఎక్కడచూసినా కాంగ్రెస్ కార్యక్రమమునందు ప్రజలు ఎక్కువ వుత్సాహాన్ని చూపించారు.

లోగడ కాంగ్రెస్ కార్యక్రమంలో పాల్గొని 1, 2 సార్లు జైళ్ళకుపోయిన కొందరు కాంగ్రెస్ వర్కర్లలో మాత్రం తగినంతగా ఆసక్తి కనిపించలేదు. దీనికి కారణం ప్రచారదళంలో వున్నవారంతా సోషలిస్టులవటం అని కొందరు అంటున్నారట. ఇదే నిజమైతేమాత్రం వారి అమాయకత్వానికి విచారించాలి. ఒకవేళ వారికి సోషలిజం అంటేను, సోషలిస్టులంటేను సరిపడకపోవచ్చు. కాని మా యీ ప్రచారం సోషలిజాన్ని గురించి కాదే. కాంగ్రెస్ చేసిన యుద్ధప్రతికూల, జాతీయవాంఛా తీర్మానముల ప్రచారమేనాయె మేము చేస్తోంది. సంపూర్ణ స్వాతంత్రం కోసం కాంగ్రెస్ కార్యక్రమం ఏదైవుంటుందో అదే తమ కార్యక్రమంగా సాగిస్తున్న సోషలిస్టులతో కొందరు కాంగ్రెసువాదులు సహకారం చేయకపోవటం విచారకరం. అంతేకాదు. ఎవరైతే కాంగ్రెస్ కార్యక్రమాన్నీ, తీర్మానాలను ఆచరణలో పెడతారో వారే నిజమైన కాంగ్రెస్‌వాదులనీ, సోషలిస్టులు ఆవిషయంలో ఎవరికీ తీసిపోవరనీకూడా గుర్తించుకోవాలి. ఈ ప్రచారదళంలో పాల్గొనవలసినదిగా కొందరు కాంగ్రెస్ నాయకులను కోరినప్పటికీ వారెవ్వరూ రాలేదనే విషయాన్ని యీ సందర్భంలో జ్ఞాపకం చేస్తున్నాము.

చిలువూరు మీటింగులో ఒకరు క్రొత్త మాగానులకు వేయబడిన నజరానాలను తీసివేయటాన్ని గురించి కాంగ్రెసు మంత్రులు ఏమి ఆలోచించారనీ, నజరానాలు ఆగష్టు 1 వ తేదీలోగా కట్టవలసిందని గ్రామంలో టమటమా వేశారనీ అడిగారు. దానికి చింతల సూర్యనారాయణగారు లోగడ ప్రకాశంగారు వచ్చినప్పుడు ఆ విషయం వారితో చెప్పామనీ, వారు ఆలోచిస్తామన్నారనీ, మనం దానికొరకు ఆందోళన సాగించాలనీ చెప్పారు. ఈ నజరానాలను కాంగ్రెస్ మంత్రులు తీసివేస్తారనీ రైతులు బాగా విశ్వసిస్తున్నారు.

కొల్లూరు సభలో ఒకరు కాంగ్రెస్‌కి జై అంటారుగాని గాంధీగారికి జై అనరేమని ప్రశ్నించారు. మనం సంస్థలకు ప్రాధాన్యం ఇవ్వాలిగాని వ్యక్తులకు కాదనియూ, గాంధీగారిలాంటి వ్యక్తులంతా కాంగ్రెస్‌లోనివారే కాబట్టి ఆ మహాసంస్థను బలపరిస్తే వారందరినీ బలపరచడమేననియూ, మేము సాగిస్తున్న ఈ కార్యక్రమమంతా నూటికి నూరుపాళ్ళు కాంగ్రెస్‌ది, గాంధిగారిదే ననియూ, వా. గోపాలకృష్ణయ్యగారు చెప్పిరి. ఇంకొకరు ఫెడరేషన్ ప్రతికూల తీర్మానమును అంగీకరించలేదు. కారణం చెప్పమంటే నేను మాటలు నేర్చుకోలేదని వూరుకున్నారు.

* * *

### రేపల్లెతాలూకా జాతీయవాంఛా తీర్మానం.

27—6—39 వ తేదీని యాత్రాదళంవారు రేపల్లె చేరుకొనిరి. సాయంత్రం రేపల్లెఫిర్కా రాజకీయ మహాసభజరిగెను. శ్రీ తూములూరి యజ్ఞనారాయణశాస్త్రిగారు అధ్యక్షతవహించారు. తాలూకా కాంగ్రెస్ కమిటీ కార్యదర్శి శ్రీ కొండూరి సీతారామయ్యగారు స్వాగతమిచ్చారు. వావిలాల గోపాలకృష్ణయ్య, కంతంనేని వెంకటసుబ్బయ్య, పాటిబండ్ల సూర్యనారాయణ, బొలిశెట్టి సుబ్బారావు (పట్టణ కాంగ్రెస్ కమిటీ కార్యదర్శి) గారలు సామ్రాజ్య యుద్ధాలను, ఫెడరేషన్ విధానాన్ని ఖండిస్తూ త్రిపురీ కాంగ్రెస్‌లో ప్యాసైన జాతీయవాంఛా తీర్మానాన్ని బలపరుస్తూ ఉపన్యసించారు.

ఇదేవిధంగా 28 వ తేదీని చోడాయెపాలెం ఫిర్కా రాజకీయసభ నల్లూరులో జయప్రదంగా జరిగెను. శ్రీ కోనేటి సుబ్బయ్యగారు అధ్యక్షత వహించారు. 29 వ తేదీని ధూళిపూడిలో ఫిర్కా మహాసభ శ్రీ వద్యారం వెంకట్రామయ్యగారి అధ్యక్షత క్రిందను; పమిడిమర్రిలో మైనేని వెంకటసుబ్బయ్యగారి అధ్యక్షత క్రిందను 30 వ తేదీని కూచినపూడిలో డాక్టరు పాతూరి అంజయ్యగారి అధ్యక్షతను; జూలై 1 వ తేదీని ప్రజ్ఞం గ్రామములో కుదితిపూడి సత్యనారాయణగారి అధ్యక్షతను; నిజాం పట్నంలో పెదమట్లపూడి ఫిర్కాసభ శ్రీ చావలి బాలసుందరంగారి అధ్యక్షను జయప్రదంగా జరిగెను. అన్ని సభలలోను వావిలాల గోపాల కృష్ణయ్యగారు, వి వి. శివయ్యగారు, పాటిబండ్ల సూర్యనారాయణగారు, కంతంనేని వెంకట సుబ్బయ్యగారు రాబోయే స్వాతంత్ర్య పోరాటానికి యావన్మంది ప్రజలు తయారు కావలసిందని ప్రబోధిస్తూ ఉపన్యాసము లిచ్చారు. త్రిపురీ కాంగ్రెస్‌లో ప్యాసైన జాతీయవాంఛా తీర్మానాన్ని—ఫెడరేషన్—యుద్ధ ప్రతికూల తీర్మానాలను బలపరుస్తూ ప్రచారంగావించారు. రేపల్లెతాలూకాలో కొన్ని ప్రాంతాలయందు ప్రజలను రాబోయే యుద్ధంలో సైనికులుగా చేర్చుకొనడానికి కవాత్‌లు నేర్పుట, కరపత్రములు పంచిపెట్టుట మొదలైన ప్రయత్నాలు సాగుచున్నవి. కాబట్టి యుద్ధంలో పాల్గొనడం వల్ల వచ్చే అనర్థాలను ప్రతిసభలోను యాత్రాదళంవారు తెలియజేసిరి. ప్రజ్ఞం గ్రామములో ఒక పాత సిపాయి తన అనుభవాలనుచెప్పి, యుద్ధంలో ఎవరూ పాల్గొనవద్దని హెచ్చరించారు. ఓవర్సీయర్ల లంచగొండితనం, భూస్వాముల అక్రమాలు, రైతులబాధలు కొన్నిసభలలో చెప్పుకొన్నారు.

* * *

### ఎవరునూ సైన్యములో చేరవద్దు

గుంటూరుజిల్లా కాంగ్రెస్ సంఘంవారు యీ క్రింది హెచ్చరిక చేయుచున్నారు:—

"నెల్లూరు, కందుకూరు ప్రాంతములలోను, గుంటూరుజిల్లాలో రేపల్లె ప్రాంతములోను, యుద్ధమునకై టెరిటోరియలు సేవయందు సైనికులను భర్తీచేయుటకు కరపత్రములద్వారా ప్రకటనలు గావించి ప్రయత్నములు జరుపబడుచున్నవని పూర్లో తిరిగి సైనికులను చేర్చుకుంటున్నారని తెలియుచున్నది. ఇట్టి యుద్ధ సన్నాహములకై మన దేశమున బ్రిటిషు ప్రభుత్వమువారు సైనికులు వగైరాలను చేర్చుకొను కార్యక్రమములను కలకత్తాలో జరిగిన అఖిల భారత కాంగ్రెసు సంఘమువారు బహిష్కరించుచూ తీర్మానించినారు. ఈ జరుగబోయే యుద్ధాలు సామ్రాజ్యాలను నిలబెట్టుకొనుటకు మన దేశ ప్రజలను బలియొసంగుటకే గాని యిందు మనకేమీ ప్రయోజనము లేదు. సామ్రాజ్యాలకు పోటాపోటీలలో మన దేశపు జన సంపదలను వాడుకొని మనకు క్రిందటి యుద్ధ విజయ పలితముగా యిచ్చిన రౌలట్ శాసనం, పంజాబు సభలు గుర్తులేదా! మనదేశీయులకు తక్కువ జీతాలు, ఇంగ్లీషు సోల్జర్లకు యెక్కువజీతాలు యిచ్చి యుద్ధములో మనవారిని ముందుంచి, మనవారిని బలి యొసంగుదురు. యుద్ధాలలో జయం వచ్చినా లాభాలు నకనకలాడు కడుపులతో, బొమిక గూడులతో, యెండుగుండెలతో వరితపించు కూలీలకు గాని, రైతులకు గాని కాక, ప్రజల రక్త మాంసములతో సుఖభోగులైయున్న రక్త పిశాచులు, సామ్రాజ్యవాదులు పంచుకొనుటకేగదా! కనుక ఈ యుద్ధాలు పూర్తిగా బహిష్కరించవలెను. కడుపు కక్కుర్తికి ఆశపడి మోసపోకండి. బ్రతికినవారిని యుద్ధాలలో పూడ్చివేసినకథలెన్నో వినుటలేదా! బ్రతికి పూడ్పించుకో దలంతురా! మీకు ఆశపెట్టుదురే కాని నిజముగా యిచ్చేది లేదు.

యుద్ధములో చేరవద్దు. సామ్రాజ్యాలు సామ్రాజ్యాలు ఒకరితో నొకరు పోరు సల్పే సమయములో మనము స్వరాజ్య పోరాటము సలిపి భారతదేశములో స్వాతంత్ర్య సంగ్రామం జరుపవలెను."

* * *

### చిత్తూరుజిల్లా కాంగ్రెస్ కమిటీ.

పై సంఘ సాధారణ సమావేశం మదనపల్లె ట్రావెలర్సు బంగాళాలో కామ్రేడ్ ఆర్. సుందర రాజయ్యంగారుగారి అధ్యక్షత క్రింద సమావేశమై యీ క్రింది తీర్మానములు ప్యాసు చేయబడినవి.

1. జిల్లాలో వాలంటీరుదళము నేర్పాటు చేయుట.

2. కమ్యూనిస్టుపార్టీపై నిషేధము తొలగింపవలసినదిగా కాంగ్రెసు మంత్రివర్గమువారు సెంట్రల్ ప్రభుత్వమును ఒత్తిడిచేయుట.

3. కాశీపట్టణంలోను, మునగాలలోను రైతులపైనను, స్త్రీలపైనను పోలీసువారు జరిపిన అమానుష కృత్యములను ఖండించుచూ ప్రభుత్వమువారు ఇందుకు కారకులైన వుద్యోగస్థులను దండించవలయునని కోరుట; చిట్టివలసలో జరిగిన కాల్పులకు చింతిల్లుచూ పోలీసువారిచర్యల ఖండించుచూ త్వరలో కార్మికుల ఆవసరముల తీర్చుటకు సహాయపడు కార్మికచట్టము ప్రభుత్వంవారు తేవలయునని కోరుట.

4. జమీందారి రిపోర్టు తయారై చాలరోజులైనను బిల్లు తయారై ప్యాసు కాకుండా యుండుటకు చింతిల్లుచు, జమీన్ రైతుల కష్టములు అధికమైనందున త్వరలో చట్టము తేవలయునని ప్రభుత్వమును కోరుట.

5. స్థానిక సంస్థలు కట్టడముల పైనను పాఠశాలలపైనను స్థానిక సంస్థలు జాతీయ పతాకమును నిలుపవలయునని కోరుట.

6. శ్రీయుత బెజవాడ గోపాలరెడ్డిగారు కావ్యబుగ్గలో యొసగిన వుపన్యాసములో కొన్ని విషయములు అహింసా సిద్ధాంతానికి వ్యతిరేకంగా యున్నవనియు, కాంగ్రెసు పలుకుబడిని నశింపచేయుచున్నవనియు, అందువలన పార్లమెంటరీ బోర్డువారు మద్రాసు స్థానికశాఖామాత్యులవారిని హెచ్చరించవలసినదిగా శ్రీ పద్మనాభరావుగారిచే తీర్మానము పెట్టబడి పేపరులోని వుపన్యాసమందలి సత్యాసత్యములను గౌ. గోపాలరెడ్డిగారివద్దనుండి వుత్తర ప్రత్యుత్తరముల మూలకంగా అధ్యక్షులవారు తెలుసుకుని పిమ్మట యుచితరీతిగా తీర్మానించుట.

7. గాంధిగారి యేకైకనాయకత్వమే మనకుండాలిఅనుతీర్మానం శ్రీ సుబ్బానాయుడుగారిచే వుపపాదింపబడి, అధ్యక్షులవారిచేనిరాకరింపబడెను.

శ్రీ రామక్రిష్ణారెడ్డిగారు, యం. ఎల్. ఏ., 3 వ తీర్మానములోని పోలీసుల చర్యలను ఖండింపకూడదని తామొకరుమాత్రం తీర్మానమును యెదిరించిరి. మంత్రిగారికి సంబంధపడిన తీర్మానమును పెట్టకూడదని తెల్పిరి.

* * *

### చిత్తూరుజిల్లా కాంగ్రెసు సోషలిస్టుపార్టీ కార్యనిర్వాహకవర్గ సమావేశము.

పైసంఘసమావేశం మదనపల్లెలో తాలూకా కాంగ్రెసు ఆఫీసుయందు 17-7-39 సాయంకాలం 5 గంటలకు సమావేశమగుసుగాన సభ్యులెల్లరును పాల్గొనకోరుచున్నాను.

యన్. పద్మనాభరావు.
చిత్తూరుజిల్లా సోషలిస్టు పార్టీ కార్యదర్శి.



"మరో ప్రపంచం, మరో ప్రపంచం" అని కలవరిస్తారు వేదాంతులు. ఎం. యన్. రాయి, రాయిస్టులు 'మరో నాయకత్వము, మరో నాయకత్వము' అని డప్పు వాయించారు. అది తీవ్రవాదమని భ్రమసి కొందరు అమాయకులు అటుపరుగిడారు. గాంధీయుల పాలసీని ముఖాముఖిని ఎదిరించగల శక్తి రాయికే ఉందని రాయిస్టులు మురిసారు. సంయుక్త నాయకత్వము కావాలనే కమ్యూనిస్టు, సోషలిస్టుల పప్పులో కాలు వేసారని వెక్కిరించారు.

వెనుకటి సంగతులు ఇప్పుడు త్రవ్వవద్దు గాని, బొంబాయి కార్మిక శాసనానికి—భారత కార్మికు లందరిచే నిరసింపబడిన శాసనానికి—వ్యతిరేకముగా జరుపబడిన జనరల్ స్ట్రయికులోరాయిస్టులు, తామూశాసనానికి వ్యతిరేకమని ఒప్పుకొంటూనే డిసిప్లినరీచర్య నోటీసుకు వెరచి పాల్గొనలేదు. అంటే కమ్యూనిస్టులమని చెప్పుకొనే రాయిస్టు సోదరులు, కార్మికవర్గము తమకు ప్రప్రధమమైన సమ్మె చేసే హక్కును రక్షించుకోడానికి చేసే కార్యక్రమములో పాల్గొనక దూరముగా నుంచున్నారు. పోనీ! అసంగతికూడా మరచిపోదాం!

రాయిస్టులు కూడ భాగస్థులైన 'త్రీవ్రవాద సంఘటన కమిటీ', జులై తొమ్మిదవ తేదీ కాంగ్రెసు వాదులు ముందుగా రాష్ట్ర కాంగ్రెసు అనుమతి పొందితేనే గాని సత్యాగ్రహంలో పాల్గొనరాదను త్రీర్మానానికి అసమ్మతి సభలు జరుపమని తీర్మానించింది. రాజేంద్రబాబు అలా చేయడము డిసిప్లినుకు విరుద్ధమని తెలియజేశాడు. వెంటనే "తీవ్రవాదుల సంఘటన" కమిటీ సమావేశమై తీర్మానాలను మార్చాలని ప్రచారము చేసికొనే హక్కు ఉందని ప్రకటించింది.

ఎం. యన్. రాయి అలా చేయడము డిసిప్లినుకు విరుద్ధమనీ, ఈ సభల్లో పాల్గొనరాదనీ, సోషలిస్టులను పాల్గొనకుండా తన పలుకుబడి ఉపయోగించమనీ జవహర్లాల్‌కు తంతినంపాడు. మరో నాయకత్వం! భలే నాయకత్వం!

చివరకు రాయిస్టు పత్రిక "ఇండిపెండెంటు ఇండియా" కూడ తీర్మానాలను ఉల్లంఘించుతూ, సత్యాగ్రహంలో పాల్గొనటము డిసిప్లినకు వ్యతిరేకమని చెప్పినా, త్రీర్మానాలను అమలు జరుపవద్దనీ, రద్దుచేయమనీ కోరుతూ సభలు జరుపడం డిసిప్లినుకు వ్యతిరేకముగాదని వ్రాసింది. కాని రాయి యింకా దిగజారాడు. సభలలో పాల్గొనుటే డిసిప్లినుకు వ్యరేతికము అంటున్నాడు.

గాంధీయులు ప్రజా పోరాటంవద్దని త్రీర్మానించారు. రాయిస్టులు డిసిప్లిన్ కోసము ప్రజా పోరాటములో పాల్గొనకూడ దంటున్నారు. రాయి అసమ్మతి సభలలో కూడా పాల్గొనరాదని హుకుం యిస్తున్నాడు. మరి "మరో నాయకత్వం" ప్రజా పోరాటాలనుండి, కదనరంగాలనుండిగాని ఉద్భవించదు. పోరాటమే లేనపుడు అయ్యో! ఇక మరో నాయకత్వము! ఎచటినుండి వస్తుంది! రాయిగారి జే-బీ-లో-మం-చా!

ఇట్టి "మరో నాయకత్వా"న్ని అనుసరించడము గేదె తోక పుచ్చుకొని గోదావరి యీదడమే! "క్షణక్షణముల్ మ. న. (ఎం. ఎన్.) రాయి చిత్తముల్"

* * *

"శిస్తులు కట్టమని రైతులకు సలహా యివ్వమని" కోరుతూ ఎక్స్ గవర్నర్ సర్ ఉస్మాన్ ప్రకాశముగారికి టెలిఫోనులో చెప్పాడట. "అది అనవసరము, నేనెచటికి వెళ్ళినా శిస్తులు కట్టమనే చెప్తున్నాను" అన్నాడు రివెన్యూ మంత్రి ప్రకాశం పంతులుగారు.

## తప్పటడుగులు - వెక్కిరింతలు

తాను హోమ్ మెంబరుగా వున్న రోజుల్లో శాసనోల్లంఘనమువైపు ఎల్లప్పుడు మ్రొగ్గే ప్రకాశముగారి 'చిత్తవృత్తి'ని గురించి సర్ ఉస్మాన్‌గారికి జ్ఞాపకము వచ్చి వుంటుంది. సామ్రాజ్యవాదుల అండచేరిన వీరుని (Knight నైటు) 'చిత్తవృత్తి' ఉస్మాన్‌గారిని "పన్నులివ్వమని చెప్పమని" చెప్పించి వుంటుంది.

ఎవరి 'చిత్త వృత్తులు' ఎవరు మార్చుకోగలరు! తమ్ము దా మరచిన కాంగ్రెసు మంత్రులు తప్ప!

* * *

డాక్టరు పట్టాభి సీతారామయ్య పంతులుగారు మచిలీపట్నము ఉపన్యాసములో 'ఎరుగని మార్క్సు'నుఅనుసరించుట కంటే 'ఎరిగిన మనువు'ను అనుసరించ వలసినదని యువకులకు సలహా యిచ్చారు. ఇంకా కమ్యూనిస్టులు రష్యా పద్ధతులు అవలంబించుతున్నారనీ, వారికి రష్యానుండి డబ్బు వస్తూందనీ సెలవిచ్చారు.

'ఎరిగిన మనువు' తన అనుచరులకు బ్యాంకులు, ఇన్‌స్యూరెన్సు కంపెనీలు, చరఖా సంఘాలు ద్వారా డబ్బు సంపాదించుకొనే విధానము చూపుతూంటే, "ఎరుగని మార్క్సు" రష్యానుండి డబ్బు వస్తే కమ్యూనిస్టులు ఎందుకు సంతోషముగా స్వీకరించ కూడదు?

కాని విషాద మేమంటే "ఎరుగని మార్క్సు" శిష్యులు ఎచట చూచినా డబ్బు లేక అవస్థ పడుతూనే కాన్పించుతున్నారు. "ఎరిగిన మనువు" అనుచరులు పచ్చ పచ్చగా మేడలు, మిద్దెలు, బ్యాంకులతో కళ కళలాడుతున్నారు. అవును మరి! ధనదేవతను పూజించి ధన్యులయినవారున్నారు గాని, 'ఎరుగని' నిరాకారుని పూజించి బాగుపడినవారెవరు?

* * *

"నీవు ఆరునెలలనాడు పుట్టి వుండకపోతే, నీ బాబు నన్ను తిట్టి వుంటాడు. అందుకని నిన్ను చంపి తింటాను" అని తోడేలు మేకపిల్లతో అందిట. ఒకటవ క్లాసు పుస్తకములోని తోడేలు మేకపిల్లకథ అంతా చదివే వుంటారు. ఆ చిన్నపిల్లలకోసం వ్రాసిన కధను మీకు ఏకరవు పెడుతున్నానని కోపపడకండి!

ఆంధ్రరాష్ట్ర కాంగ్రెసు వర్కింగు కమిటీ నరసారావుపేట సమావేశములో తోడేలు వాదాన్ని జ్ఞాపకము చేసే ఒక విచిత్రమైన తీర్మానము చేసింది. చిత్తూరు జిల్లా కాంగ్రెసు కమిటీచే ఎన్నుకోబడిన సివిక్ బోర్డు ఖద్దరు సూత్రానికి విరుద్ధమైన తీర్మానము చేసిందట. దానిపై రాష్ట్ర వర్కింగు కమిటీ, ఆజిల్లాకాంగ్రెసు కమిటీనిరద్దుచేస్తూ తీర్మానించింది. ఈవాదం ప్రకారమే డిసిప్లినరీ చర్యలు తీసికోడం ప్రారంభించితే వివిధలోకల్ బోర్డులలో కాంగ్రెసుపార్టీకి ద్రోహం చేస్తున్న మెంబర్లను ముందు సెలెక్టు చేసినందులకు ఆంధ్ర కాంగ్రెసు నాయకులపై చర్య తీసికోవాలి. తరువాత ద్రోహిగా తేలిన 'ఖరే'ను ప్రధానమంత్రిగా స్వీకరించిన పటేలుపై చర్య తీసికోవాలి.

అయితే దీనికి తోడేలు కధకూ ఒక భేద ముంది. కధలో తండ్రి తప్పుకు పిల్లన్నుమింగుతానంది తోడేలు. రాష్ట్రకాంగ్రెసు వర్కింగుకమిటీ సివిక్‌బోర్డు (పిల్ల) తప్పుకు జిల్లాకాంగ్రెసు కమిటీని(తండ్రిని) మ్రింగింది. అయితే రెంటిలోనూ అంతర్గర్భితమైన వాదం మాత్రం ఒకటే! ఏమంటే ప్రత్యర్థులైన తీవ్రవాదుల చేతుల్లో వున్న కాంగ్రెసుకమిటీని భగ్నంచేసి తృప్తిపడాలి రాష్ట్ర కాంగ్రెసు కమిటీ! మేకపిల్లను భక్షించి తృప్తి పడాలి తోడేలు!

* * *

మునగాల రైతుల సత్యాగ్రహంలో పోలీసులు తమ యిష్టమొచ్చినటుల చేయవచ్చుననీ, ఆ పాప పంకిలము నుంచి తన చేతులు శుభ్రముగా కడిగివేసుకొన్నాననీ, రాష్ట్ర కాంగ్రెసు కార్యదర్శి గొట్టిపాటి బ్రహ్మయ్యగారు అమధ్య పోలీసు సూపరింటెండెంటుకు ఉత్తరము వ్రాసియిచ్చారని నమ్మకమైన వారినుండే తెలియవచ్చింది. అయినా యీపాప పంకిలము ఆ పెద్ద మనిషిని గురించి ప్రజలలో ప్రచారం చేసే బాధ్యత నా కెందుకని యింత వరకు మౌనం వహించాను.

కాని దీనిని మించిన అన్యాయము యింకోటి వినవస్తూంది. కాశీపట్నము ఖైదీలను విడుదలచేస్తే మునగాల సత్యాగ్రహము వచ్చింది: మునగాలవారిని విడుదల చేస్తే వెంకటగిరిలో వస్తుంది. కాన యిపుడు విడుదల చేయవద్దని రాష్ట్రీ కాంగ్రెసు నాయకులు మంత్రి వర్గానికి సలహా యిచ్చారన్న వార్తలు కర్ణా కర్ణిగా వినవస్తున్నాయి ఇదే నిజమయితే రాష్ట్రీ కాంగ్రెసు నాయకులు ప్రజల విశ్వాసాన్ని గోల్పోతారని వేరే చెప్పనక్కరలేదు. తీవ్రవాదులపై కక్షతో, పోలీసులకు జమీంగారులకు దగ్గరగానూ, ప్రజలకు, రైతులకు దూరంగానూ అవడం తమ శ్రేయస్సుకే భంగకరమన్న ఎంత త్వరగా తెలసికొంటే అంత మంచిది నాయకమ్మన్యులు!

* * *

సంయుక్త రాష్ట్రీ కాంగ్రెసు వర్కింగు కమిటీ చీటికీ మాటికీ ఉపవాస దీక్షబూనే వారిపై డిసిప్లినరీ చర్య తీసుకోవాలని తీర్మానించింది. ఉపవాస దీక్షబూనేవారు చావడానికి సిద్ధమయితేనే ఆ పనికి పూనుకొంటారు. వారు దేనికై ఉపవాస దీక్షబూనారో అది సక్రమమైన కారణమయితే ప్రజల సానుభూతి సంపాదించుతారు. లేక బెదరింపుకు చేస్తే అదే వీగిపోతుంది. అంతేగాని చావడానికి సిద్ధమయి ఉపవాసం చేయబూనే వారిని డిసిప్లినరీ చర్య ఏ విధంగా భయపెట్ట గలుగుతుంది! పైగా చావనున్న వానిపై డిసిప్లినరీ చర్య తీసుకోడం అహింసయా లేక దాని అపభ్రంశమా?

* * *

జవహర్ పండితుడు కాంగ్రెసు తీర్మానానికి వ్యతిరేకముగా అసమ్మతి సభలు జరపడము డిసిప్లినుకు వ్యతిరేక మన్నాడు. సంయుక్త జాతీయ ప్రతిఘటన అని పెద్ద పెద్ద కబుర్లంటే అర్థం యిదేనా అని ఆక్షేపించాడు.

పండిత్‌జీ! డిసిప్లిన్ అన్నా, యు. యన్. యఫ్ (సంయుక్త జాతీయ ప్రతిఘటన) అన్నా, స్వాతంత్ర్య పోరాటాన్ని సాగించడానికీ, జాతీయ స్వాతంత్ర్యాన్ని సంపాదించడానికీ గాని వట్టి కబుర్లు కావు. ప్రజాపోరాటములలో కాంగ్రెసువాదులు పాల్గొనరాదనే అఖిల భారత కాంగ్రెసుకమిటీ తీర్మానం స్వాతంత్ర పోరాటానికి, స్వరాజ్య సంపాదనకే ఆటంకము. డిసిప్లిను, యు.యన్.యఫ్.(జాతీయ ఐక్యత) ఇట్టి తీర్మానాలకు తలవొంచి పోరాటమే లేకుండ చేయటానికి కాదు. స్వరాజ్యము సంపాదించడానికి డిసిప్లిను,జాతీయఐక్యత గాని, బానిసత్వానికి తలలొంచడానికి గాదు. బానిస దేశములో శాంతి, బానిసత్వం నెరవేర్చడములో డిసిప్లిను బానిసలకు సిగ్గుచేటు. అట్టి శాంతి, డిసిప్లిను భారతదేశములో లేకుండా ఎంతత్వరగా పోతే అంతమంచిది.

# ఎ. ఐ. సి. సి. తీర్మాన నిరసన సభలు

ఇటీవల బొంబాయి ఎ. ఐ. సి. సి. లో స్వానైన సత్యాగ్రహాలను నిషేధించుచూ, మంత్రులను విమర్శింపరాదను తీర్మానాలయెడల నిరసన తెల్పుటకు, "అతివాద సమ్మేళన సంఘం"వారి ఆదేశానుసారం యీనెల 9 వ తేదీని జరిగిన అనేక బహిరంగ సభలలో అతివాద సమ్మేళన సంఘంవారి తీర్మానం ఆమోదించబడింది.

బెజవాడలో కాంగ్రెస్ సోషలిస్టు పార్టీ యొక్క, ప్రెస్‌వర్కర్సు యూనియన్‌యొక్క యువజన సమితియొక్క, ఫార్వర్డు బ్లాక్ శాఖ యొక్క, యాజమాన్యాన 9 వ తేదీ సాయం కాలం 4½ గంటలకు ఎర్రజెండాలతోను జాతీయ పతాకాలతోను, సుమారు 150 మంది ఊరేగింపుగా ప్రెస్ వర్కర్సు యూనియన్ కార్యాలయంవద్ద బయలుదేరి, "స్వతంత్రభారత్‌కీ జయ్", "సత్యాగ్రహంచేసే హక్కు ఉండాలి", "రైతు-కూలీ పోరాటాలను బలపరచాలి", "కాంగ్రెసు ఐక్యతను కాపాడాలి", "మునగాల సత్యాగ్రహుల్ని విడుదలచేయాలి" మొదలైన నినాదాలతోను, జాతీయ-రైతు గీతాలతోను, పురవీధులగుండా ఊరేగి, సాయంత్రం 6½ గంటలకు గాంధీపార్కులో బహిరంగ సభ జరిపారు. సభకు పేట బాపయ్యగారు అధ్యక్షత వహించారు. కామ్రేడ్సు కె. యల్. నరసింహం, వి. వెంకటేశ్వర్లు, కంభంపాటి సత్యనారాయణ, గారలు కాంగ్రెసుయొక్క బలం ఏవిధంగా ప్రజాపోరాటాలవల్లనే లభించేదో నిరూపించి అ. భా. కాం. కమిటీలో స్వానైన రెండు తీర్మానాలు ఏవిధంగా కాంగ్రెసు ఐక్యతకు భంగకరమో స్పష్టపరుస్తూ ఉపన్యసించారు. కాంగ్రెస్ మ్యునిసిపల్ కౌన్సిలర్ శ్రీ కోట నాగభూషణంగారు, డాక్టరు జంధ్యాల పూర్ణయ్యశాస్త్రిగారు తీర్మానాన్ని బలపరుస్తూ ఉపన్యసించారు. మునగాల రైతు సత్యాగ్రహుల్ని విడుదల చేయవలసిందనీ, యీలోగా వారిని రాజకీయ ఖైదీలుగా పరిగణించ వలసిందనీ, మద్రాసు మంత్రివర్గాన్ని కోరుతూ మరొక తీర్మానం ప్రవేశపెట్టబడి, రెండు తీర్మానాలు ఏకగ్రీవంగా ఆమోదించబడ్డాయి.

### ఏలూరు

ఏలూరు కాంగ్రెస్ సోషలిస్టుపార్టీ కార్యాలయంనుండి 9 తేదీ సాయంత్రం 4-30 గంటలకు పెద్ద ఊరేగింపు జరిగి 6 గంటలకు హిందూ యువజన సంఘ ఆవరణలో బహిరంగ సభ జరిగెను. కామ్రేడ్ అత్తులూరి సర్వేశ్వరరావుగారు అధ్యక్షత వహించారు. కామ్రేడ్సు గారపాటి సత్యనారాయణ, తాడి అప్పలస్వామి, తోట నరసయ్యగారలు తీర్మానాన్ని స్పష్టపరుస్తూ ఉపన్యసించారు. ముంగళంపల్లి చంద్రశేఖరరావుగారు వ్యతిరేకంగా మాట్లాడారు. ఒక్క వోటు వ్యతిరేకంగా, సభ్యులంతా తీర్మానాన్ని ఆమోదించారు. రైతు సత్యాగ్రహుల్ని రాజకీయ ఖైదీలుగా పరిగణించాలని కోరుతూ మరొక తీర్మానం ఆమోదించబడింది.

### ఇతర ప్రదేశాలు.

ఇదే విధంగా నెల్లూరులో జరిగిన బహిరంగసభలలో అత్యధిక సంఖ్యాకులు "అతివాద సమ్మేళనసంఘం" వారి తీర్మానానికి అనుకూలంగా వోటు చేసారు. కోలవెన్నులో వ్యవసాయ ప్రేమీ కూలీ సంఘంవారి యాజమాన్యాన శ్రీ అల్లూరి వెంకట కృష్ణయ్యగారి అధ్యక్షతను; యువజనసంఘ, సోషలిస్టుపార్టీల యాజమాన్యమున జమీగొల్వేపల్లిలోను; ముదునూరులో గ్రామ రైతు సంఘాధ్యక్షులైన పాలడుగు నాగభూషణంగారి అధ్యక్షతను; సోమవరంలో గ్రామ కాంగ్రెస్ కార్యదర్శిగారి అధ్యక్షతను; రుద్రవరంలో గ్రామ కాంగ్రెస్ సంఘాధ్యక్షులైన ఏలేశ్ల వెంకట సుబ్బయ్యగారి అధ్యక్షతను; లంకల కోడేరులో పశ్చిమ గోదావరి జిల్లా కాంగ్రెస్ కమిటీ ప్రధాన కార్యదర్శి భూపతిరాజు బాపిరాజుగారి అధ్యక్షతను; జిన్నూరులో నర్సాపురం తాలూకా కాంగ్రెసు కమిటీ కార్యదర్శి ఉద్దరాజు సూరపరాజుగారి అధ్యక్షత క్రిందను; సీతాపురంలో శ్రీ వెంకటేశ్వర్లుగారి అధ్యక్షత క్రిందను; గుంటూరు తాలూకా చేకూరు గ్రామంలో చావలి శీతారామయ్యగారి అధ్యక్షతను; చిట్రగుంట రైల్వే కాలనీలో వి. సుబ్బరామయ్యగారి అధ్యక్షతను జరిగిన బహిరంగ సభలన్నింటిలోను "అతివాద సమ్మేళన సంఘం" వారిచే ప్రకటించబడిన తీర్మానం ఏకగ్రీవంగా ఆమోదించ బడింది.

★

### తూ. గో. జిల్లా కాం॥ సోషలిస్టు పార్టీ కార్యనిర్వాహక సంఘ సమావేశము.

18 జూలై '39 ఉదయం 11 గంటలకు రాజమండ్రిలో పార్టీ ఆఫీసులో యీదిగువ విషయాలు చర్చించుటకు పై సమావేశము జరుగునుగాన సభ్యులెల్లరు హాజరు కావలయును.

విషయాలు

1. కార్యనివేదిక
2. జిల్లా వాలంటీరు యాత్ర
3. కాంగ్రెసు కమిటీలలో మనమవలంబించవలసిన విధానము
4. జిల్లాబోర్డు ఎన్నికలు
5. బొంబాయి అ. భా. కాంగ్రెసు కమిటీ తీర్మానాలు
6. గుడిమూల రైతుల సమస్య
7. కార్యాలయ కార్యదర్శి నియామకం
8. ప్రచురణ పరిశీలన సంఘ నియామకం
9. ఇతరములు

క్యాంపు: కొత్తపేట } కొ. పట్టాభిరామయ్య
9 జూలై 39 } కార్యదర్శి.

★

## బోసుగారికి ఆహ్వానం

బెంగాల్ రాష్ట్ర కాంగ్రెసు కమిటీ అధ్యక్షుడయిన సుభాష్‌చంద్రబోస్ ఆంధ్రదేశము వచ్చునప్పుడు ఆహ్వానపు ఏర్పాట్లు జేయడానికి పశ్చిమ గోదావరిజిల్లా కాంగ్రెసు కమిటీయు, ఉత్తర విశాఖపట్నం జిల్లా కాంగ్రెసు కమిటీయు తీర్మానాలు గావించెను.

## పత్రికలు - పుస్తకాలు

### వాహిని

నాల్గోయేట ప్రారంభంలో దినపత్రికల సైజులో 12 పేజీలతో, అనేక నూతన శీర్షికలతో వెలువడింది. కార్మిక-కర్షక సేవలో "ఘాటైన వ్రాతలకు పేరు పొందినది."వాహిని.ప్రజావిప్లవ వాహినితో బాటు, వాహిని దినదిన ప్రవర్ధమానమగుగాకయని కోరుచున్నాం.

విడిప్రతి అణా : 23 స్ట్రింగర్ స్ట్రీట్,
జి. టి. మద్రాసు.

★ ★ ★

### ప్రజాబంధు (మాసపత్రిక)

ప్రజాబంధు వారపత్రికగాక ఇపుడు కొత్తగా ఒకమాసపత్రికను (డెమ్మీపుస్తకం సైజులో) ప్రారంభించారు. ఎస్. జి. ఆచార్యగారు కానీ పత్రిక మొదలు కొని, అణన్నర పత్రికదాకా, దినపత్రిక మొదలుకొని, త్రైవార, ద్వైవార, వార, పక్ష, మాస, పత్రికలను నడుపుటలో ఆరితేరిన సిద్ధహస్తం ఆచార్యగారిది. కాబట్టి దీనిని ప్రత్యేకంగా ప్రశంసించాలా?

రాజకీయ, సాంఘిక, సారస్వత సమస్యల్ని ప్రత్యేకంగా వ్యంగధోరణిలో నడపాలని వీరి కోరిక. ఆ ఆశయాన్ని ప్రతిబింబిస్తూనే ఉన్నది సంచిక.

అవధాని, చక్రపాణి, గోపీచంద్, సూరి మొదలగువారి వ్యాసాలే గాక, కిరణాలు, తిమ్మన్న, ముఖాముఖి, రాజాజీ, స్వదేశ సంస్థానాలు, పత్రికల కత్తిరింపులలో సంపాదకుల ప్రత్యేక కృషి విశదమౌతోంది.

గెటప్ బాగా ఉంది. ముఖపత్రంపైన ప్రకాశంగారి బొమ్మ, లోన రాజకీయ; సినిమాలకు సంబంధించిన ఆర్టుపేపర్ చిత్రాలూ ఉన్నాయి.

60 పేజీలు: ఒక అణా: 39 అండర్సన్ స్ట్రీట్ మద్రాసు.

★ ★ ★

### చిత్ర

కుర్రా సుబ్బారావుగారి సంపాదకత్వాన వెలువడిన సినిమా మాస పత్రిక, "ఫిలింఇండియా" సైజున, 40 పేజీలు. అర్థవంతమైన ముఖచిత్రమూ-దానిపై సూర్యకుమారి చిత్రమూ, ఆకర్షవంతంగా ఉంది. సినిమాలకు పత్రికలకూ సంపాదించిన హేమాహేమీల అక్షంతలు, ఆశీస్సులు, దీవెనలు ఉన్నాయి. నేటి ఫిలిం రంగంలో అభివృద్ధినికోరుతూ, సలహాలనిస్తూ వ్రాసిన మంచివ్యాసా లున్నాయి. వ్యాసాలతోపాటు తారల సుందర చిత్రాలున్నాయి.

ఇపుడిపుడే వృద్ధి అవుతూన్న సినిమా పరిశ్రమ బాగుపడాలంటే, సద్విమర్శలతో, సహాయకరంగా ఉండాలి సినిమా పత్రికలు. ఆకర్తవ్యాన్ని నెరవేర్చడానికి ప్రజలంతా 'చిత్ర'కు ఇతోధిక సహాయం చేయాలని కోరుతున్నాం.

విడికాపీ 0-2-0, సం॥ చందా 1-8-0
1/8 ఆలీవర్ రోడ్, మైలాపూర్, మద్రాసు.

★ ★ ★

### స్వీకారం

మాయ లోకం
(తొమ్మిది జీవిత తరంగాలు)
రచయిత : ముద్దా విశ్వనాథంగారు,
ప్రకాశకులు : సౌత్ ఇండియన్ పబ్లిషర్సు లిమిటెడ్, 34, బోస్సు వీధి, జి.టి. మద్రాసు.

# నవశక్తి

### జూలై

| | చేర్పించాలసిన కోటా | మొదటివారంలో చేర్పించింది. (విరాళాలతోకలిపి) |
|---|---|---|
| | సం. చందాలు | సం. చందాలు |
| విశాఖపట్టణం | 4 | 1½ |
| తూర్పుగోదావరి | 15 | 2½ |
| పశ్చిమ గోదావరి | 20 | 23½ |
| కృష్ణా | 37 | 6½ |
| గుంటూరు | 25 | ½ |
| నెల్లూరు | 25 | ½ |
| ఇతరస్థలాలు | 8 | 1 |
| | 134 | 36 |

★





### కాంగ్రెస్ సభ్యులు

# సమ్మె భగ్నం చేయడానికి చీపుళ్లు పట్టుకున్నారు!

వీరంగం మునిసిపాలిటీ కార్మికుల సమ్మె
మున్సిపల్ కమిటీ సభ్యులే వీధులను తుడిచారు

అహమ్మదాబాదు జిల్లా వీరంగం మునిసిపాలిటీలో పనిచేయు హరిజన కార్మికులు గత జూన్ 25 వ తేదీ నుండి సమ్మెచేస్తూన్నారు. తమ కూలిని హెచ్చించమని సమ్మెదార్లు అడిగారు.

మునిసిపాలిటీలో పని చేయుచున్నప్పుడు, ప్రత్యేక వేరే పని చేయడము లేదని హామీ యివ్వవలెననియు, అట్లు ఇచ్చినయెడల, కార్మికుల కోర్కెలను చాలవరకు తీర్చెదమనియు అధికారులు చెప్పారట. కాని అట్లు హామీ ఇచ్చుటకు కార్మికులు అంగీకరించ లేదట. సుమారు నూరుమంది కార్మికులు సమ్మె చేస్తూన్నారు.

మునిసిపలు కాంగ్రెసు పార్టీ సభ్యులే వీధులను వూడ్చారట.

40 మంది వీధి తుడుచువారిని అహమ్మదాబాదు నుండి వీరంగమునకు పంపారట. కాంగ్రెసు మునిసిపలు కౌన్సిలర్సు సమ్మె విఘాతకులుగ ప్రవర్తించుట కడు శోచనీయము.

## నెల్లూరు

జమీన్‌రైతుసంపాదకులు కార్మికులను తిరిగిరప్పించిరి:

ప్రెస్‌వర్కర్సు యూనియన్ 7 వ తేదీని సమావేశమై ఈ క్రింది విధముగా తీర్మానించింది.

"జమీన్‌రైతు ప్రెస్ ప్రొప్రయిటరు మద్రాసునుండి (ఆంధ్రప్రభలో పని చేయుటకు పంపిన) వర్కర్లను వెనక్కి పిలిపించుటచేత సమ్మెను ఆపుచేయడమైనది. శ్రీ రామానాయుడుగారు కార్మికుల అభీష్టమును అంగీకరించి సమ్మెను త్వరగా పరిష్కరించినందులకు యీ సభ, వారిని అభినందిస్తూ వుంది."

బస్సు వర్కర్ల సమ్మె

నెల్లూరుజిల్లా సింగరాయకొండ బస్సుసర్వీసు లిమిటెడ్‌కు చెందిన డ్రైవర్లు, కండక్టర్లు, క్లీనర్లు మొత్తం 40 మంది వరకు జులై 1 వ తేదీనుంచి సమ్మెకట్టిరని తెలియుచున్నది. జీతములు తగ్గించుట, జీతములలో పక్షపాతము, వేర్వేరు సెక్షన్లకు వర్కర్లను మార్చి యిబ్బంది పెట్టుట సమ్మెకు కారణములు.

వర్కర్ల యిబ్బందుల విషయము యోచింతుమని మేనేజిమెంటువారు మాట యిచ్చుట వలన ఆ రోజు మధ్యాహ్నమే సమ్మె ఆపుచేయబడినది.

## నంద్యాల

స్వీపర్ల యూనియన్

జూన్ 30 వ తేదీన స్థానిక మునిసిపల్ స్వీపర్స్ అండ్ స్కావెంజర్సు యూనియను సమావేశము వారి క్వార్టర్సుయందు కోడి నరసింహం గారి అధ్యక్షతను జరిగినది. వారి దైనందిన ఇబ్బందులను గూర్చి చర్చించిరి. తమ డ్యూటీకి తోడుగా వంతుల ప్రకారం మునిసిపలు ఆఫీసు ఎద్దుల డిపోయందు ఏలాటి అలవెన్సు గాని లేకుండా కావలా గాయుచు రాత్రులందు బరుండవలసినట్లు నిర్బంధించుచుండుటను రద్దు గావించవలసినదిగా మునిసిపలు కమీషనరు గారిని, చైర్మను గారిని కోరుచు ఒక తీర్మానము గావించిరి. ఈ విషయమున ఆయా అధికారులతో సంప్రదింప నరసింహం గారికి అధికార మొసంగిరి.

## చీరాల

పొగాకు కంపెనీ పనివారల యూనియన్.

ఈ పొగాకు కంపెనీ కార్మిక యూనియన్‌యొక్క కార్యనిర్వాహకసభ, సంఘ జనరల్ కార్యదర్శియగు బూదరాజు నరసింహారావుగారి అధ్యక్షతను జరుపబడి ఈ క్రింది తీర్మానము ఆమోదింపబడెను. యూనియన్ తరపున కంపెనీ అధికారులతో ఉత్తర ప్రత్యుత్తరములు జరుపుటకును, సందర్శించి మాట్లాడుటకును జనరల్ శక్రటరీగార్కి అధికారము యిచ్చిరి. కంపెనీ ప్రైమ్మరీశాఖలో స్వల్ప నేరములకు తీవ్ర శిక్షలు విధించుచున్నందుకును, కంపెనీలో నూతనముగా కంట్రాక్టు పద్ధతి ఏర్పరచినందుకును, ఖాళీలు వచ్చినప్పుడు యూనియన్ సభ్యులగు పాతవారిని వదలి క్రొత్తవారిని చేర్చుకొనిన అధికారుల వైఖరిని ఖండించుచూ, స్త్రీ కూలీలకు మగ కూలీలకువలె దిన భత్యము నాలుగు అణాలనుండి అయిదాణాలకు హెచ్చు చేయమని ప్రైమరీ పికరీ శాఖలలో పనిచేయు కూలీల ఆరోగ్యము కాపాడుకొనుటకు నోటికి ముక్కుకు కావలసిన మూతలు సప్లయిచేయుటకు, కంపెనీలో పాయిఖానా దొడ్లను ఆరోగ్యవంతముగా కట్టించుటకు కంపెనీ అధికారులను కోరుచూ తీర్మానము గావించిరి.

పై తీర్మానములను చర్చించుచు అందుకువలయు ఏర్పాటులను గావింపమని జనరల్ శక్రటరీ బూదరాజు నరసింహారావుగారు కంపెనీ అధికారులతో మాట్లాడిరి, అధికారులు నరసింహారావుగారు చెప్పినదంతయు సావధానముగా విని ఆ విషయమై ఆలోచించి పై అధికారులకు వ్రాసి తగుచర్యతీసు కొందుమని చెప్పినట్లు తెలియుచున్నది.

## మదరాసు

రాష్ట్ర ట్రేడ్ యూనియన్ కాంగ్రెసు.

మద్రాస్ రాష్ట్ర ట్రేడ్ యూనియన్ కాంగ్రెసు కార్యనిర్వాహక వర్గము, అనుబంధ సంఘాల ప్రతినిధుల సమావేశం జూలై 15 తేది ఉదయం 10 గంటలకు మద్రాసు కాంగ్రెసు భవనమందు జరుగును.

ఎజెండా

(1) కార్మిక శాసనమునుగూర్చి మద్రాస్ ప్రభుత్వం ప్రకటించిన మెమొరాండం.

(2) కాన్స్టిట్యూషన్ సబ్‌కమిటీ రిపోర్టు.

(3) కమిటీ గత సమావేశానంతరం కార్మిక వుద్యమమునుగూర్చి విచారించుట.

(4) కార్యదర్శిచే ప్రవేశపెట్టబడు యితర విషయాలు.

పి. రామమూర్తి,
ప్రధాన కార్యదర్శి

## తెనాలి

ఫ్యాక్టరీ కూలీల సమ్మె.

తెనాలిలో శ్రీ రామలింగేశ్వర ఫ్యాక్టరిలో నిప్పు, ఊక వేయు కూలీలలో ఇద్దరు వారికి రావలసిన కూలి పూర్తిగా యివ్వకుండా అక్రమంగా మినహాయించుకుంటున్నారని గట్టిగా అడిగినందుకు 28—6—39 రాత్రి వారిద్దరినీ పనిలోనుంచి మానుకోవలసిందని గుమాస్తా చెప్పాడు. అందువల్ల ఆ రాత్రే మేమెవ్వరమూ పనిలోకి రాము, వాళ్ళిద్దరినీ పెట్టుకుంటే మేము వస్తాము లేకపోతే రాము అని చెప్పి అదే పనిచేయు మొత్తం ఎనిమిదిమంది కూలీలు పని మానివేసిరి. 29—6—39 ఉదయం ఈ సమాచారం తెలిసి మామూలుగా వచ్చే ఆడ కూలీలుకూడా పనిలోకి రాలేదు. మొత్తం 22 కూలీలు పనిలోకిపోలేదు. ఇతరులెవ్వరినీ పోనీయలేదు. 29 వ తేదీ రోజల్లా ఫాక్టరీ మూసివేయబడే ఉంది.

30—6—39 ఉదయం ఈ సమ్మె సమాచారము తెలియని కొందరు కూలీలను పిలిపించి నిప్పు వేయించి సమయానికి కూత కూయించారు, కాని ఎవరూరాలేదు. ఈ సమాచారం స్థానిక సోషలిస్టులకు తెలిసి ఇటువంటి సమ్మె సమయంలో పనిలోకి పోరాదనిరి. నిప్పు వేయటానికి వచ్చిన కొత్త పనివాళ్ళతో చెప్పి, ఫ్యాక్టరీ యజమానులతో మీరు పనిలోనుంచి తీసివేసిన వారితో కూడా మొత్తం పనివారిని పనిలో పెట్టుకొనవలసిందనీ వారిని రావలసిన కూలి మినహాయించుకోకుండా పూర్తిగా ఇవ్వవలసిందనీ చెప్పిరి. అందులకు యజమానులు అంగీకరించినందున పనివారు 30—9—39 మధ్యాహ్నం 1 గంటకు పనిలోకి వెళ్ళిరి.

## బెజవాడ

రైల్వే పనివారల సభ

యం. యస్. యం. రైల్వే పనివారల సంఘ యాజమాన్యమున బెజవాడ ఇండియన్ ఇన్‌స్టూటు మైదానములో 24—6—39 వ తేదీ సాయంత్రం శ్రీ యస్. రాజగోపాలయ్యర్‌గారి అధ్యక్షత క్రింద జరిగిన బహిరంగ సభలో యీ క్రింది తీర్మానములు ఆమోదింపబడినవి.

1. భీమవరం పి.డబ్ల్యు ఇనస్పెక్టరుగారు గ్యాంగు వారిని అనవసరముగా కొట్టుట, బూతులు తిట్టటము సాగించుచున్నందున, గ్యాంగు వారిని పని జేసినా ఆప్సెంటుమార్కు జేస్తున్నందున, గ్యాంగువారిని పనిలోకి తీసుకోకుండా నిరాకరించుచున్నందున వారిలో అసంతృప్తి ప్రబలుచున్నది. చీఫ్ ఇంజనీయరు గారు గ్యాంగువారి కష్టములను ఆలోచించి ఇనస్పెక్టరుగారిని యితర సెక్షనులకు బదిలీ చేయవలెనని ఈ సభవారు కోరుచున్నారు.

2. మద్రాసురాష్ట్రములో కార్మిక శాసనము తీసుకురాబోవుచున్నందుకు కాంగ్రెసు మంత్రివర్గమును అభినందించుచూ, మద్రాసు ట్రేడ్‌యూనియను కాంగ్రెసు చేసిన సూచనల ప్రకారము ఆగష్టుమాసములో తప్పక కార్మిక శాసనము తీసుకొని రావలెనని ఈ సభవారు కోరుచున్నారు.

ఆర్. వి. సుబ్రమణ్యం
కార్యదర్శి.

నవశక్తి
మీ కోర్కెలు
మీ కష్టాలు
ప్రతిబింబింపజేసి
మీ కోసం
పోరాడుతుంది

# నవశక్తి

నవశక్తి
జాతీయ,
అంతర్జాతీయ సమస్యల్ని
విశదీకరించి
విశ్వశాంతిని
ప్రబోధించుతుంది

---



Published by M. Chandrasekhara Rao } at Navasakti Press, Governorpet, Bezwada.
Printed by Tummala Venkata Ramiah }

